గలిగిన పెద్ద స్థావరమైన అంబాలానూ మే నెలాఖరున, విముక్తి చేశారు; జనరల్ ఏన్సన్ నాయకత్వాన సైనిక కేంద్రభాగం ఒకటి ఇక్కడ సమీకృతమైంది.... వేసవికాలం గడపడానికై వచ్చి అక్కడ నివసించుతూన్న ఇంగ్లీషు కుటుంబాలతో క్రిక్కిరిసివున్న సిమ్లా పర్వతస్థావరంపై తిరుగుబాటుదార్లు దాడి చేయలేదు.

మే 25, తన చేతికిందవున్న చిన్న సేనను తీసుకుని జనరల్ ఏన్సన్ ఢిల్లీపై దాడిచేయడానికి తరలివెళ్లాడు; మే 27 న అతడు మరణించాడు; అతనిస్థానే సర్ హెన్రీ బార్నార్డ్ నియమించబడ్డాడు; జనరల్ విల్సన్ నాయకత్వానవున్న ఇంగ్లీష్ సైనికబలాలు, (మీరట్ నుండి వచ్చినవి; మార్గమధ్యంలో ఇవి సిపాయిలతో తలపడి యుద్ధం చేశాయి), జూన్ 7 న బార్నార్డ్ సేనతో కలుసుకున్నాయి. తిరుగుబాటు హిందూస్థానం సర్వత్రా వ్యాపించింది; వేర్వేరుగా ఒకదానితో ఒకటి దూరంగా వున్న 20 స్థలాల్లో ఏకసమయంలో సిపాయిలు తిరగబడి ఇంగ్లీషువారిని హత్యచేశారు; తిరుగుబాటు ముఖ్య స్థలాలు: ఆగ్రా, బరేయిలీ, మురాదాబాద్. "ఇంగ్లీషు కుక్కల" పట్ల సింధ్యా విశ్వాసంగా ఉన్నాడు, అతని "ఆశ్రితులు" మాత్రం తత్‌వ్యతిరేకం; పాటియాలా రాజు — సిగ్గు చేటు! — ఇంగ్లీషువాళ్ల సహాయార్థం పెద్ద సైనికబలాన్ని పంపించాడు.

మైన్‌పూరీవద్ద (పశ్చిమోత్తర రాష్ట్రాలలో), కుర్రకక్కగట్ట ఇంగ్లీష్ లెఫ్టెనెంట్ డి కాంట్జో, ఖజానానూ కోటనూ కాపాడాడు. కాన్పూర్‌లో, 1857 జూన్ 6 న, నానా సాహెబ్, సర్ హ్యూ వీలర్‌ను ముట్టడించాడు; [కాన్పూర్‌లో తిరుగుబాటు చేసిన 3 సిపాయి రెజిమెంట్లకూ, 3 దేశీయ కేవెల్రీ రెజిమెంట్లూ నానా సాహెబ్ నాయకత్వాన ఉన్నాయి; కాన్పూర్ సైనికబలాల నాయకుడైన సర్ హ్యూ వీలర్ కింద (ఇంగ్లీష్) ఇన్‌ఫెంట్రీ బటాలియన్ ఒక్కటే ఉంది; ఇతనికి బైటనుండి కొద్దిపాటి అదనపు బలాలు మాత్రమే అందాయి; కోట, బారకాసులూ ఇతని స్వాధీనంలో ఉన్నాయి; పట్నంలో వున్న ఇంగ్లీషువాళ్లూ, స్త్రీలూ, పిల్లలూ అందరూ పారిపోయివచ్చి ఇక్కడ తలదాచుకున్నారు].

జూన్ 26, 1857, కాన్పూర్‌ను తన స్వాధీనం చేసిన పక్షంలో యూరపియన్లందరికీ శరణు ఇస్తానని నానా సాహెబ్ వాగ్దానం చేశాడు; జూన్ 27 న (షరతులకు

వీలర్ ఒప్పుకొనగా), ముట్టడిలో ఇంకా సజీవులైవున్న 400 ల మందిని పడవల్లో ఎక్కి గంగానది దిగువగా వెళ్లనిచ్చారు; నానా రెండ వైపులనుండీ కాల్పులు ప్రారంభించాడు; ఒక పడవ తప్పించుకోగా, నది దిగువ దాన్ని ముంచేశారు, రక్షకసేనలో వారందరిలోనూ 4 మనుష్యులు మాత్రమే బతికారు. స్త్రీలతోనూ పిల్లలతోనూ నిండి వున్న ఒక పడవ నదిలో ఇసక గట్టుకు తగులుకోగా, వారిని పట్టుకుని కాన్పూర్‌కు నడిపించి తీసుకుపోయి, వారిని ఖైదుచేసి కోటలో బంధించారు; 14 రోజుల తరువాత (జూలైలో) ఫతేఘర్ (ఫరుఖాబాద్‌కు 3 మైళ్ల దూరంలో వున్న సైనికస్థావరం) నుండి తిరుగుబాటు చేసి వచ్చిన సిపాయిలు మరికొంతమంది ఇంగ్లీష్ ఖైదీలను ఆ కోట్లోలోనే తొక్కేశారు. కానింగ్ ఉత్తరవులను అనుసరించి, మద్రాసుపట్నం, బొంబాయి, సింహళాలనుండి సైనికబలాలను తరలించుతున్నారు. మే 23 న, నెయిల్ నాయకత్వాన మద్రాసునుండి వచ్చిన అదనపు బలాలూ, ఇండస్ నదిపైన వచ్చిన బొంబాయి సైనిక విభాగమూ లాహోర్‌కు వెళ్లుతున్నాయి.

జూన్ 17, సర్ పాట్రిక్ గ్రాంట్ (ఏన్సన్ తరువాత బెంగాల్‌లో సర్వసేనాని), అతని అజుటంట్ జనరల్, జనరల్ హావ్‌లక్ కలకత్తా చేరి, అక్కడనుండి ఏకాయకీ బయల్దేరారు.

జూన్ 6, అలహాబాద్‌లో సిపాయిలు పితూరీ చేసి, (ఇంగ్లీష్) ఆఫీసర్లను, స్త్రీలను పిల్లలతోసహా కసాయికత్తికి బలిగావించి, కర్నల్ సిమ్సన్ కాపాడుతూన్న కోటను పట్టుకోవడానికి ప్రయత్నించారు; జూన్ 11 న కలకత్తానుండి మద్రాస్ ఫ్యుసిలీయర్స్‌తో వస్తూన్న కర్నల్ నెయిల్ నుండి ఇతనికి అదనపు బలాలు అందాయి; కలకత్తా కోటలోవున్న సిక్కులనందరినీ నెయిల్ పంపించేసి, కోట రక్షణార్థమై ఒక్క బ్రిటిష్ సైనికులనే ఉంచాడు. (మార్గమధ్యంలో అతడు బెనారెస్‌ను ఆక్రమించుకుని, పితూరీ మొదటి దశలో వున్న 37 వ దేశీయ ఇన్‌ఫెంట్రీ రెజిమెంటును ఓడించాడు; సిపాయిలు పట్నంలోనుండి పారిపోయారు); సైనికబలాలు (ఇంగ్లీషు) నాలుగు వైపులనుండీ అలహాబాదులోకి పరుగెత్తుకొని వచ్చాయి.

జూన్ 30, జనరల్ హావ్‌లక్ అలహాబాద్ చేరగానే నాయకత్వం వహించి, సుమారు 1,000 మంది బ్రిటిష్‌వారితో కాన్పూర్ మీదకి తరలివెళ్లాడు; జూలై 12 న

ఫతేపూర్ వద్ద సిపాయిలను తిప్పికొట్టడం, వగైరా కార్యాలు కావించాడు, మరి కొన్ని సంఘర్షణలు కూడా జరిగాయి.

జూలై 16, హావ్‌లక్ సేన కాన్పూర్ శివార్లు చేరుకుంది; హిందూదేశస్థులను ఓడించాడు, కాని అప్పటికే ఆలస్యంగా రావడం కారణంగా కోటలోకి ప్రవేశించలేకపోయాడు; ఖైదీలుగా పట్టుకున్న ఇంగ్లీష్ ఆఫీసర్లనూ, స్త్రీలనూ, పిల్లలనూ అందరినీ ఆ రాత్రి నానా ఊచకోత కోసేశాడు; తరువాత మందుగుండు కొట్టును పేల్చేసి, పట్నాన్ని వదిలిపెట్టి వెళ్లిపోయాడు. — జూలై 17, ఇంగ్లీషు సైనికబలాలు కోటలో ప్రవేశించాయి. — నానా స్వగ్రామమైన బిఠూర్ మీదకి హావ్‌లక్ దండెత్తి, ఎట్టి ప్రతిఘటన లేకుండానే ఆ వూరును పట్టుకుని, రాజప్రాసాదం ధ్వంసంచేసి, కోట పేల్చేసి, కాన్పూర్‌కి తిరిగి వెళ్లిపోయాడు; అక్కడ దుర్గరక్షక సైన్యంతో స్థావరం కాపాడమని నెయిల్‌కు ఒప్పజెప్పి, హావ్‌లక్ లక్నోను విముక్తి చేయడానికై తరలివెళ్లాడు; అక్కడ సర్ హెన్రీ లారెన్స్ ఎన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ అవన్నీ విఫలంకాగా, ఒక్క రెసిడెన్సీ మినహా, పట్నమంతా సాంతమూ తిరుగుబాటుదార్ల వశమైపోయింది.

జూన్ 30, దుర్గరక్షక సైన్యమంతా ఒక్క సమూహంగా సమీపంలో వున్న తిరుగుబాటుదార్ల సైన్యంపై దాడిచేయడానికి తరలివెళ్లింది; అపజయం పొందింది; తిరిగి రెసిడెన్సీలోనే తలదాచుకుంది; శత్రువులు ఈ భవనం ముట్టడించారు.

జూలై 4, సర్ హెన్రీ లారెన్స్ మరణం (జూలై 2న ఫిరంగిగుండు పేలి గాయం తగలడం కారణంగా); కర్నల్ ఇంగ్లిస్ నాయకత్వం వహించాడు; అప్పుడప్పుడు ముట్టడిదార్లపై ఉధృతగతిఘర్షణలు చేస్తూ మూడు నెలలు నిలబడ్డారు. — హావ్‌లక్‌చే యుద్ధచర్యలు (పుట 271).[105] ఇతడు కాన్పూర్ తిరిగి చేరుకున్న తరువాత, పెద్ద సైనిక సమూహంతో సర్ జేమ్స్ ఔట్రామ్ ఇతనిని కలుసుకున్నాడు; వివిధ పితూరీ జిల్లాలలో చెదిరివున్న అనేక రెజిమెంట్లతో ఏర్పడిన అదనపు బలాలను ఔట్రామ్ కూడా తరలించాడు.

సెప్టెంబరు 19, హావ్‌లక్, ఔట్రామ్, నెయిలుల నాయకత్వం కింద ఈ సేన అంతా గంగానదిని దాటింది. 23 న, లక్నోకి 8 మైళ్ల దూరంలోవున్న అయోధ్య రాజుల వేసవికాల భవనం, అలంబాగ్‌ను తుపానుదాడిచేసి వశపర్చుకున్నారు.

సెప్టెంబరు 25, లక్నోపై అంతిమ దాడి జరిపి, రెసిడెన్సీని చేరుకున్నారు; ఇక్కడ మరొక రెండు నెలలు తీవ్రమైన దిగ్బంధన పరిస్థితులలో వీరు గడపవలసి వచ్చింది. (నగరంలో జరిగిన యుద్ధంలో జనరల్ నెయిల్ నేలకొరిగాడు; ఔట్రామ్ చేతికి తీవ్రమైన గాయం తగిలింది.)

సెప్టెంబరు 20, జనరల్ విల్సన్ నాయకత్వాన ఆరు రోజులు ప్రత్యక్ష యుద్ధం జరిగిన తరుపరి ఢిల్లీ పట్టుపడింది. (వివరాలకై చూ. పుటలు 272, 273.) తన అశ్వికదళాన్ని ముందుకు నడిపించుతూ హాడ్సన్ రాజప్రాసాదంలోకి చొరబడి ముసలి రాజునూ, రాణినీ (జీనాత్ మహల్) పట్టుకున్నాడు; వారిని బందిఖానాలో తోసేసి, హాడ్సన్ తన చేతులతో రాజకుమారులను (తుపాకితో కాల్చి) చంపేశాడు. ఢిల్లీ కోటలోనూ నగరంలోనూ రక్షకసేనలు ఏర్పాటై, శాంతి నెలకొల్పబడింది. తక్షణమే కర్నల్ గ్రేట్‌హెడ్ ఢిల్లీ నుండీ ఆగ్రాకు బయలుదేరి, ఆగ్రా సమీపంలో హోల్కార్ ముఖ్యపట్నమైన ఇందూర్ నుండి వచ్చిన బలమైన పితూరీదార్ల సైనికబలాన్ని ఓడించాడు.

అక్టోబరు 10, ఇతడు ఆగ్రాను వశపర్చుకుని, కాన్పూర్‌కు బయలుదేరి, అక్టోబరు 26న చేరుకున్నాడు; ఈలోపున కెప్టెన్ బోయిలూ, మేజర్ ఇంగ్లిష్, పీల్, షవర్స్‌లు తమ సేనలతో (పీల్ కింద నావికా సైనికుల బ్రిగేడ్ ఉంది), తిరుగుబాటుదార్లను అజమ్‌ఘర్, ఛత్రా (హజారీబాగ్ సమీపంలో), కజ్వా గ్రామాల వద్దనూ, ఢిల్లీ సమీప ప్రాంతంలోనూ ఓడించారు. (ఫ్రోబిన్, ఫేన్‌ల నాయకత్వాన వున్న రెండు అశ్వికదళాలూ, స్వదేశంనుండి వచ్చిన కొన్ని అదనపు బలాలు సంఘర్షణలో పాల్గొనడానికి సిద్ధంగా ఉన్నాయి; స్వచ్ఛంద సైనిక పటాలాలు కూడా తయారయాయి), ఆగస్టు నెలలో కలకత్తాలో సర్ కాలిన్ కాంబెల్ సర్వసేనాధిపత్యం వహించి, భారీస్థాయిలో యుద్ధం సాగించడానికి సిద్ధంగా వున్నాడు.

నవంబరు 19, 1857, లక్నోవద్ద రెసిడెన్సీలో ముట్టడించబడి వున్న దుర్గరక్షక సైనికబలాలను సర్ కాలిన్ కాంబెల్ విముక్తిచేశాడు. (నవంబరు 24 న సర్ హెన్రీ హావ్‌లక్ మరణించాడు); లక్నో నుండి —

నవంబరు 25, 1857 — కాలిన్ కాంబెల్ కన్పూర్ తరలివెళ్లాడు; ఈ పట్నం తిరిగి తిరుగుబాటుదార్ల వశమైంది.

డిసెంబరు 6, 1857, కాన్పూర్ ఎదుట జరిగిన యుద్ధంలో కాలిన్ కాంబెల్ విజయం సాధించాడు; తిరుగుబాటుదార్లు పట్నం వదిలిపెట్టేసి పారిపోయారు; సర్ హోప్ గ్రాంట్ వారి సేనలను వెన్నాడి, చెండాడు. కర్నల్ సీటన్

చేతిలో పాటియాలా వద్దనూ, మేజర్ హాడ్సన్ చేతిలో మైన్‌పూరీ వద్దనూ తిరుగుబాటుదార్లు ఓడిపోయారు; ఇంకా అనేకచోట్ల కూడా ఓడిపోయారు.

జనవరి 27, 1858, డాన్ వగైరా, ఎదుట యుద్ధశాసన న్యాయస్థానంలో ఢిల్లీ పాదుషాను విచారణకు తీసుకొచ్చారు, "మామూలు కంటకుడు" కింద (1526 నుండి పరిపాలించుతూన్న మొగల్ వంశ ప్రతినిధిని!) ఉరిశిక్ష విధించారు; శిక్షను రంగూన్‌లో యావజ్జీవ దేశాంతర వాసశిక్ష కింద మార్చేశారు. సంవత్సరాంతంలో అక్కడకు పంపించేశారు.

1858 లో సర్ కాలిన్ కాంబెల్ యుద్ధచర్యలు. జనవరి 2 న ఫరుఖాబాద్, ఫతేఘర్‌లను ఇతడు స్వాధీనం చేసుకుని కాన్పూర్‌లో తన స్థానం ఏర్పరచుకున్నాడు; నలుపక్కలనుండీ అందుబాటులో వున్న అన్ని సైనికబలాలనూ, యుద్ధసామగ్రినీ, ఫిరంగులనూ ఈ నగరానికి చేర్చవలసిందని ఉత్తరవుచేశాడు. — లక్నో వద్ద మోహరించి వున్న తిరుగుబాటుదార్లను ముందుకు సాగనివ్వక వారిని సర్ జేమ్స్ ఔట్రామ్ అక్కడే నిలువరించి ఎదిరించాడు. — అనేక ఘటనలు జరిగిన తర్వాత (చూ. పుటలు 276, 277), మార్చి 15 న (కాలిన్ కాంబెల్, సర్ జేమ్స్ ఔట్రామ్ వగైరాల నాయకత్వాన) లక్నో తిరిగి పట్టుకొనబడింది. ప్రాగ్దేశపు అమూల్య కళాఖండ సంచయమున్న ఈ పట్నాన్ని లూటీచేశారు; మార్చి 21 కి పోరాటం ఆగిపోయింది; 23 నాటికి కడసారి ఫిరంగి కాల్పు. — ఫెరోజ్ రాజకుమారుడు (పాదుషా కొడుకు), బిఠూర్ రాజు నానా సాహెబ్, ఫైజాబాద్ మౌల్వీ, అయోధ్య బేగమ్ హజ్రత్ మహల్ నాయకత్వాన తిరుగుబాటుదార్లు బరేయిలీకి పారిపోయారు.

ఏప్రిల్ 25, 1858. కాంబెల్ షాజహాన్‌పూర్‌ను స్వాధీనపర్చుకున్నాడు; బరేయిలీ సమీపంలో తిరుగుబాటుదార్ల దాడిని మొగ్గ్ తిప్పికొట్టాడు; మే 6 న బరేయిలీపై ముట్టడి ఫిరంగులు కాల్పులు ప్రారంభించాయి; ఈ లోపున ముందుగా చేసుకున్న నిర్ణయం ప్రకారం, మురాదాబాద్‌ను పట్టుకొన్న తదుపరి జనరల్ జోన్స్ బరేయిలీకి వచ్చాడు; నానా, అతని అనుచరులూ పారిపోగా, ప్రతిఘటనలేకుండానే బరేయిలీ స్వాధీనమైపోయింది. ఈలోపుగా తిరుగుబాటుదార్లచే దట్టంగా ముట్టడించబడిన షాజహాన్‌పూర్‌ను జనరల్ జోన్స్ విముక్తిచేశాడు; లక్నోనుండి తరలివస్తూన్న లూగార్డ్ నాయకత్వాన వున్న డివిజన్, కోవర్ సింగ్ నాయకత్వాన వున్న పితూరీదార్లను

ఎదుర్కొని, అటకాయించగా ఈ డివిజన్ తీవ్రంగా దెబ్బతింది; సర్ హోప్ గ్రాంట్ బేగమ్‌ను ఓడించగా, కొత్త బలాలను సమీకరించుకొనేందుకై ఆమె గోగ్రా నది వైపుగా పారిపోయింది; ఇది జరిగిన కొద్ది రోజులకే ఫైజాబాద్ వశొర్ప్వ నేలకొరిగాడు.

జూన్ మధ్యరోజులు, 1858, అన్ని చోట్లా పితూరీదార్లు అపజయం పొందారు; సమన్వయ చర్యలు జరపడానికి వారికి శక్తిలేదు; బందిపోటు దొంగల ముఠాల కింద చీలిపోయారు; అనేక భాగాలుగా విడిపోయిన ఇంగ్లీషు సైనిక బలాలను తీవ్రంగా వేధించుతున్నారు. యుద్ధచర్యల కేంద్రస్థానాలు: బేగమ్, ఢిల్లీ రాజకుమారుడు, నానా సాహెబ్‌ల పతాకలు. మధ్య ఇండియాలో సర్ హ్యూ రోజ్ 2 నెలలుగా (మే, జూన్ నెలలలో) సాగించిన యుద్ధచర్యలతో తిరుగుబాటుపై ఆఖరిదెబ్బ.

జనవరి 1858, రోజ్ రాహట్‌ఘర్‌ను, ఫిబ్రవరిలో సాగర్, గర్రాకోటలను వశపర్చుకొని, రాణి* రణరంగంగా ఎంచుకున్న ఝాన్సీ మీదకి పురోగమించాడు.

ఏప్రిల్ 1, 1858, ఝాన్సీని రక్షించడానికై నానా సాహెబ్ బంధువు తాంతియా తోపే కాల్పీనుండి పురోగమించి రాగా, అతనితో గొప్ప సంఘర్షణ జరిగింది; తాంతియా ఓడిపోయాడు.

ఏప్రిల్ 4, ఝాన్సీ పట్టుపడింది; రాణీ, తాంతియా తోపే తప్పించుకునిపోయి, ఇంగ్లీషువారికోసం కాల్పీ వద్ద కాచుకుని ఉన్నారు; ఆ దిశగా తరలివెళ్లుతూండగా —

మే 7, 1858 — కుంచ్ అనే ఊరు వద్ద బలమైన శత్రుసేనలు రోజ్‌ని అటకాయించాయి; వారిని రోజ్ పూర్తిగా ఓడించేశాడు.

మే 16, 1858, కాల్పీకి కొద్ది మైళ్ల దూరంలో తిరుగుబాటుదార్ల సేనలను రోజ్ చుట్టుముట్టాడు.

మే 22, 1858, కాల్పీనుండి తిరుగుబాటుదార్లు మొండిధైర్యంతో ఉధృతగతి ఘర్షణ సాగించారు; అపజయంపొంది పారిపోయారు.

మే 23, 1858, కాల్పీని రోజ్ స్వాధీనపర్చుకొన్నాడు. తీవ్రవేసవి [యుద్ధచర్యల వలన] దెబ్బ తగిలిన తన సైనికులకు విశ్రాంతి కలుగుజేయడానికై అక్కడ కొన్ని దినాలు ఆగాడు.

---

*లక్ష్మీబాయి — సం.

జూన్ 2, యువకుడైన సింధ్యాతో (ఇంగ్లీషు కుక్కలను కాచేవాడు) తన సైనికులతోనే తీవ్రమైన యుద్ధం చేసినతరువాత, తన సైనికులచే గ్వాలియర్ నుండి తరిమి వేయబడి, ప్రాణం దక్కించుకోడానికై ఆగ్రాకు పారిపోయాడు. రోజ్ గ్వాలియర్ పై దాడి వెడలాడు; తమ తిరుగుబాటుదార్ల సైన్యాలతో ఝాన్సీ రాణీ, తాంతియా తోపే, అతనితో —

జూన్ 19—లోష్కార్ కొండ (గ్వాలియర్ ఎదురుగా) వద్ద యుద్ధం చేశారు; రాణీ యుద్ధంలో మరణించింది; విశేషజనం శత్రుఖడ్గానికి బలి అయిన తర్వాత ఆమె సైన్యం చెదిరిపోయింది. గ్వాలియర్ ఇంగ్లీషువారి వశమైంది.

జూలై, ఆగస్టు, సెప్టెంబరు 1858, ఈ నెలలలో సర్ కాలిన్ కాంబెల్, సర్ హోప్ గ్రాంట్, జనరల్ వాల్‌పోల్‌లు తిరుగుబాటుదార్ల ముఖ్యనాయకులకొరకై వేట మొదలుపెట్టారు; ఇంకా శత్రువశంలో వుండి, లొంగని దుర్గాలనన్నిటినీ స్వాధీనపర్చుకో నారంభించారు; ఆఖరిసారిగా బేగమ్ కొన్ని స్థలాలలో నిల దొక్కుకుని పోరాడింది, కాని ఓటమిపొంది, నానా సాహెబుతో కలిసి రాప్తీ నది దాటి ఇంగ్లీషువారి కుక్కల నౌకరు అయిన నేపాల్ రాణా జంగ్ బహదూర్ రాజ్యంలోకి పారిపోయారు; తన దేశంలోకి పారిపోయివచ్చిన తిరుగుబాటుదార్లను వెన్నాడడానికి ఇంగ్లీషువారికి అతను అనుమతినిచ్చాడు; ఈ విధంగా "దుర్మార్గపు బందిపోట్ల ఆఖరి ముఠాలు చెదిరిపోయాయి;" నానా, బేగమ్, ఇద్దరూ కొండల్లోకి పారిపోయారు, వారి అనుచరులు లొంగిపోయారు.

1859 తొలి నెలలు, తాంతియా తోపే యొక్క అజ్ఞాతవాసస్థలం పసికట్టి, అతనిని పట్టుకుని, విచారణచేసి, ఉరితీశారు. — నానా సాహెబు నేపాల్‌లో చనిపోయాడని "నమ్మకం." బరేయిలీ ఖాన్‌ను పట్టుకుని కాల్చేశారు; లక్నోవాసుడైన మామూ ఖాన్‌కు యావజ్జీవ ఖైదు శిక్ష వించారు; కడమవారిలో కొందరికి దేశాంతర వాస శిక్ష, కొందరికి వివిధ సంవత్సరాల ఖైదు శిక్ష విధించారు; తిరుగుబాటు దార్ల రెజిమెంట్లు రద్దుచేయబడగా, వారిలో అత్యధిక సంఖ్యాకులు ఆయుధాలు విసర్జించి, రైతులుగా మారిపోయారు. అయోధ్య బేగమ్ నేపాల్‌లో కట్మాండూలో నివసించింది.

అయోధ్య గడ్డను ఆంగ్లో-ఇండియన్ ప్రభుత్వానికి జప్తుకాబడి, ప్రభుత్వ ఆస్తిగా దఖలు పడ్డట్టు కానింగ్ ప్రకటన! జనరల్ ఔట్రామ్ స్థానే సర్ రాబర్ట్ మంట్గొమెరీ అయోధ్య ఛీఫ్ కమీషనర్‌గా నియమింపబడ్డాడు.

ఈస్ట్ ఇండియా కంపెనీ రద్దు. యుద్ధం ఇంకా ముగియకముందే కంపెనీ విచ్ఛిన్నమై పోయింది.

డిసెంబరు 1857, పామర్స్టన్ ఇండియా చట్టం; 1858 ఫిబ్రవరిలో బోర్డ్ ఆఫ్ డైరెక్టర్ల సభ తన నిరసన గంభీరంగా తెలియజేసినప్పటికీ మొదటి పఠనానికి అంగీకారం లభించింది, కాని లిబరల్ మంత్రివర్గం స్థానే టోరీ మంత్రివర్గం అధికారంలోకి వచ్చింది.

ఫిబ్రవరి 19, 1858, డిజ్రేలీ ప్రవేశపెట్టిన ఇండియా చట్టం వీగిపోయింది (చూ. పుట 281).

ఆగస్టు 2, 1858, లార్డ్ స్టాన్లీ ప్రవేశపెట్టిన ఇండియా చట్టం నెగ్గింది; దీనితో ఈస్ట్ ఇండియా కంపెనీకి స్వస్తి. "మహనీయురాలైన" విక్టోరియా సామ్రాజ్యంలో ఇండియా ఒక రాష్ట్రమైంది!

కె. మార్క్స్‌చే పద్దెనిమిదివందల డెబ్బై సంవత్సరాలలో రచించబడింది.

లిఖిత ప్రతిననుసరించి ముద్రించబడింది. జర్మన్ మాతృకకు అనువాదం.

227

# ఉత్తర ప్రత్యుత్తరాలు

## ఎంగెల్స్‌పేర మార్క్స్

అగస్టు 15, 1857

...ఢిల్లీలో పరిస్థితులెలా వున్నాయంటే ఎప్పుడైతే rainy season had set in* ఇంగ్లీషువారు తిరోగమనం ప్రారంభించబోతారని నాకు తోస్తూంది. నీ బదులు నేను తాత్కాలిక సైనికనిపుణునిగా "Tribune" లో రాయాల్సివచ్చింది కనుక, నా సొంత పూచీమీదనే, ఈ విధంగా జరుగుతుందని జోస్యం చెబుతూ రాశాను** ఈ తేదీవరకూ అందిన వార్తలు నిజమనుకుంటేనూ notabene—on the supposition.***

ఢిల్లీ పడిపోయిందని అదేపనిగా వినవస్తూన్న వదంతులనన్నిటినీ కలకత్తా ప్రభుత్వమే ప్రచారం చేస్తూంది; మద్రాసు, బొంబాయి రాజధానులలో క్రమపద్ధతిని నిలబెట్టేందుకు ఇవే ప్రధాన సాధనంగా ఉపయోగపడుతూన్నట్టు ఇండియన్ పత్రికలవల్ల నాకు అవుపడుతూంది. ఈ ఉత్తరంతో ఢిల్లీ ప్లాను నీకు పంపిస్తున్నాను. ఉబుసుపోయేందుకని దీనిని నీకు పంపించుతున్నాను; అయినా దీనిని నువ్వు చూసిన తర్వాత నాకు తిరిగి తప్పకుండా పంపించేయాలి....

---

* వర్షాలు బాగా పడడం మొదలుకాగానే — అనువాదకుడు.

** చూ. ఈ సంకలనం పుటలు, 62,69,71. — సం.

*** నిజమనుకునే షరాతో — అనువాదకుడు.

కాదంబరి

# మార్క్సుపేర ఎంగెల్సు

రైడ్, సెప్టెంబరు 24, 1857

... ఇండియా పై చర్చలు జరపడానికి నీకు కలిగిన కోర్కె, ఈ వ్యవహారం అంతటిని గురించీ నా అభిప్రాయం తెలుసుకోవాలని నీకుంటుందనే నేనూ అనుకోవడమూ — ఈ రెండూ ఒక్క సారే తటస్థించాయి. సరిగ్గా ఈ సమయంలోనే, తాజాటపాలో వచ్చిన ముఖ్యమైన వార్తలను, మ్యాపుతోసహా చూస్తూ చదవడానికి నాకు అవకాశం కూడా కల్గింది; voici ce qui en résulte.*

మిలిటరీ దృక్స్థానంనుండి మధ్య, ఉత్తర గంగానదీప్రాంతాల్లో బ్రిటిష్ స్థానాలు ఎంత ఘోరంగా చెదిరిపోయి ఉన్నాయంటే, ఆ ప్రాంతాల్లో విడివిడిగానూ, ముట్టడిలోనూ వున్నట్టి రక్షకదళాలలో వీలైనవన్నిటినీ సమీకరించుకున్న తర్వాత, హావ్‌లక్ కింద వున్న సేనా, ఆగ్రాలో వున్న ఢిల్లీ విభాగమూ, ఈ రెండూ ఒక దానితో ఒకటి త్వరగా కలుసుకోవడమూ; ఆగ్రానూ గంగకి దక్షిణంగా వున్న స్థానాలను మాత్రమేనూ గ్వాలియర్‌నూ (మధ్య ఇండియాలోవున్న సంస్థానాధీశుల దృష్ట్యా), తమ చేతిలో నిలబెట్టుకోడమూ; గంగమీదే దిగువగా వున్న అలహాబాద్, బెనారెస్, దీనాపూర్‌లాంటి స్థానాలను స్థానికంగా వున్న రక్షకదళాలతోనూ కలకత్తానుండి వచ్చిన అదనపు దళాలతోనూ నిలబెట్టుకోవడమూ; ఈలోపుగా, సైనికబలాలను పునః సమర్థవంతం చేయడానికీ, చలనశీలమైన దళాలను వినియోగించి పరిసరప్రాంతాలను అదుపులో ఉంచుకోడానికీ, సామగ్రులను కూడబెట్టుకోడానికీ వీలుగా ఉండేందుకుగాను స్త్రీలనూ యుద్ధంలో పాల్గొనని వారినీ ఈ స్థలాలనుండి ఖాళీ చేయించి,

---

* ఇదిగో దీని ఫలితం — అనువాదకుడు.

వారిని నదిదిగువగా పంపించివేయడమూ — ఇదొక్కటే సరైన మార్గం. ఆగ్రాను నిలబెట్టు కోడం సాధ్యంకాకపోతే, కాన్పూర్‌కూ, ఇంకా అవసరమైతే అలహాబాద్‌కూ తిరోగమించడమే ఉత్తమం; ఏమైనప్పటికీ ఈ రెండవ స్థానం, గంగాయమునల మధ్యనున్న దేశానికంతటికీ ఇదే కీలకమై ఉండడం కారణంగా, దీనిని మాత్రం చిట్టచివరి వరకూ రక్షించుకునే తీరాలి.

ఆగ్రాను నిలబెట్టుకొంటూ, బొంబాయి సేనను ధారాళంగా ఉపయోగించుకోడానికి వీలుగా వుండే పక్షంలో, బొంబాయి మద్రాసు సేనలు అహమదాబాద్ కలకత్తా అంక్షాంశ రేఖ వెంటే — ఇందూర్ గ్వాలియర్ల మీదుగా ఆగ్రాకు బొంబాయి సైన్యమూ, సాగర్ గ్వాలియర్ల మీదుగా ఆగ్రాకూ, జబ్బల్‌పూర్ మీదుగా అలహాబాద్‌కూ మద్రాసు సైన్యమూ — ద్వీపకల్పాన్ని ఆక్రమించుకుని, ఉత్తరానితో సంబంధాలు స్థాపించుకోడానికై శ్రేణులను పంపాలి. పంజాబ్ నిలబడగలుగుతే పంజాబ్ గుండానూ, కలకత్తానుండి దీనాపూర్ అలహాబాద్‌ల మీదుగానూ ఆగ్రాకి ఇతర రవాణా మార్గాలున్నాయి. ఈ విధంగా నాలుగు రవాణా మార్గాలూ, పంజాబ్ మినహా కలకత్తా బొంబాయి మద్రాసుల దిశగా మూడు తిరోగమన మార్గాలూ; దక్షిణంనుండి వచ్చిన సైనికబలాలను ఆగ్రాలో సాంద్రీకరించడంవల్ల మధ్య ఇండియాలో వున్న సంస్థానాధీశులను నెమ్మది పరచడానికీ, పురోగమనమార్గ మంతటా వున్న ఉపప్లవాన్ని అణచివేయడానికీ సహాయ పడతాయి.

ఆగ్రాను నిలబెట్టుకోడానికి వీలులేని పక్షమందు, అలహాబాద్‌తో శాశ్వతంగా రవాణా మార్గాలు స్థాపించుకున్న తరువాత, ఈలోపుగా బొంబాయి సేన గ్వాలియర్‌కి తిరోగమించుతూండగా, అలహాబాద్‌లోవున్న సైనికబలాలతోసహా ఆగ్రాకి మద్రాసు సేన వైదొలగడం అన్నిటికంటె ముఖ్యమైన విషయం.

మద్రాసు సైన్యాన్నిచూస్తే, కేవలం ఆకతాయి జనాన్నే అందులో చేర్చుకున్నట్టు కనబడుతూంది; ఈ కారణంగా ఇటువంటి మనుషులమీద ఆధారపడ్డం ఎంతవరకు మంచిదో అంతవరకే ఆధారపడాలి. బొంబాయి సేనలో బటాలియన్ ఒక్కంటికీ 150, అంతకుపైగా కూడా దేశీయులున్నారు; ఇది చాలా ప్రమాదకరమైన విషయం; ఎందుచేతంటే కడమ వారిని వీరు తిరుగుబాటుకు పురికొల్ప గల్గుతారు. బొంబాయి సేన గనుక పితూరీ చేసిందంటే, ఇక ప్రస్తుతానికి మిలిటరీ జోస్యాలనన్నిటినీ కట్టిపెట్టేయ్యాల్సే ఉంటుంది; అలాటి పరిస్థితుల్లో, కాష్మీర్‌నుండి కన్యాకుమారి వరకూ బ్రహ్మాండమైన ఊచకోత మాత్రం తథ్యం. బొంబాయిలోని పరిస్థితి తిరుగుబాటుదార్లపైన సేనను ఉపయోగించుకొనలేనట్టిదే గనుక అయితే, ఇక అట్టి సందర్భంలో అధమం నాగపూర్ దాటి పురోగమించినట్టి మద్రాసు శ్రేణులకు అదనపుబలాలు పంపించడమూ, ఈ శ్రేణులు వీలైనంతత్వరగా అలహాబాదుతోగాని బెనారెస్‌తోగాని సంబంధాలు ఏర్పరచుకోవడమూ చాలా ముఖ్యం.

యథార్థమైనట్టి సార్వభౌమ నాయకత్వం లోపించడం కారణంగా బ్రిటిష్ విధానంలో ఏర్పడిన అసంబద్ధ పరిస్థితుల ఫలితాలు పరస్పరాధికం చేసుకొనే రెండు విషయాలలో ఇప్పుడు బైటపడుతున్నాయి: మొదటిది, తమ సైనికబలాలను విభజించుకోవడం ఫలితంగా తమ సేనంతా చిన్నచిన్నవైపోయి దూరందూరంగా చెదిరిపోయిన స్థానాలలో కట్టుబడిపోయి వుండే టట్టుగా వాటంతట అవే చేసుకుంటున్నాయి: ఇక రెండవది, తమకున్న ఒకేఒక చలనశీలమైన శ్రేణినీ ఢిల్లీదగ్గర నిలదొక్కుకుని స్థిరంగా అట్టేపెట్టేయడంవల్ల అక్కడ అది ఏకార్యమూ సాధించలేకుండా నిరర్థకంగా ఉండిపోవడమేకాకుండా, విపత్కర పరిస్థితులలో సహితం చిక్కుకుంది. ఢిల్లీమీదకి సైన్యాలను పంపించిన ఇంగ్లీషు జనరల్‌ని సైనికశాసనం కింద విచారణచేసి ఉరితీసేసినా పాపంలేదు; ఎందుచేతంటే, ఇటీవల మాత్రమే మన కందరికీ తెలిసిన విషయం అతడు తప్పకుండా తెలిసికొనే వుండాల్సింది. అదేమిటంటే, యథావిధిగా ముట్టడి జరిపి పట్టణం స్వాధీనం చేసుకోవాలంటే అథమం ఏ 15 వేల, 20 వేల సైన్యమో ఉంటేనేకాని వీలుపడనట్టుగానూ, లేదా పట్టణం ఉచితరీతిని రక్షించబడిన పక్షంలో ఇంతకు మించిన సైనికబలాన్ని ఉపయోగించుతేనేగాని పట్టణాన్ని ముట్టడిసైన్యాలు స్వాధీనం చేసుకోడానికి వీలులేనట్టుగా, పట్నంయొక్క దుర్గరక్షణ నిర్మాణాలను బ్రిటిష్‌వారే పటిష్ఠం చేశారనే విషయం — అతనికి తప్పకుండా తెలిసే వుండాలి. ఇక ఇప్పుడు వారక్కడ ఉన్నారు గనుక, రాజకీయకారణాల దృష్ట్యా, వారక్కడే అంటిపెట్టుకుని ఉండిపోవాలి; అక్కడ నుండి ఉపసంహరణ అపజయంతో సమానమే; అయినప్పటికీ, ఉపసంహరణను వారు తప్పించుకోవడం వారికి బహుశ సాధ్యంకాదు.

హావ్‌లక్ సైనికులు చాలా కార్యాలు సాధించారు. అటువంటి శీతోష్ణ పరిస్థితులలో, అందులోనూ అటువంటి కాలమానంలో, ఎనిమిది రోజుల్లో 126 మైళ్ళు తరలిరావడం, అదే సమయంలో ఆరో ఎనిమిదో యుద్ధాలుచేయడం మనుష్యమాత్రుడుకి దుస్సాధ్యం. కాని అతని సైనికులు ఇప్పుడు బాగా అలసటపడి ఉన్నారు; అందుచేత కాన్పూర్ చుట్టుపట్ల కొద్ది దూరంలోనైనా దాడులుచేయడానికి వీరిని బయల్దేరించాడంటే, మిగిలిన శక్తి సహితమూ కోల్పోయి, ఇక వీరు పూర్తిగా నిస్త్రాణపడిపోయి, తనే దిగ్బంధంలో చిక్కుకుంటాడు; లేదా అంటే అతడు అలహాబాద్‌కే తిరిగి వెళ్లాల్సేనా వస్తుంది.

పునః దిగ్విజయయాత్ర సాగించడానికై అవలంబించాల్సిన పథం నిజంగా గంగానది ఎగువలోయవెంటే ఉంటుంది; కేవలం బెంగాల్ పరగణా ఒక్కటే చేతిలో వుంచుకోవడంలో పెద్ద కష్టమేమీ లేదు; ఎందుకంటే అక్కడి ప్రజ బాగా దిగజారిపోయి ఉన్నారు; చిక్కు అంతా దీనాపూర్ ప్రాంతంనుండే ప్రారంభమౌతూంది. ఇందుచేతే దీనాపూర్, బెనారెస్, మీర్జాపూర్, అందులోనూ మరీ ప్రధానంగా అలహాబాద్, అత్యంత ముఖ్యమైనవి. ఇంగ్లీష్

వారు అలహాబాద్‌నుండి బయలుదేరి మొదట దోఆబ్‌నూ (గంగాయమునల మధ్యదేశం) రెండు నదుల తీరాలనూ వున్న నగరాలనూ, తర్వాత అయోధ్యనూ, అటుతర్వాత కడమ ప్రదేశాన్నీ జయించుకోగల్గుతారు. అలాంటప్పుడు మద్రాసునుండీ, బొంబాయినుండీ అలహాబాదుకూ, ఆగ్రాకూ వెళ్ళే మార్గాలు కేవలం అప్రధాన సైనికచర్యా మార్గాలుగానే ఉండగల్గుతాయి.

ఎప్పుడూ ఉన్నట్టుగానే ఇప్పుడు కూడా, సాంద్రీకరణే అతిముఖ్యమైన విషయం. గంగ ఎగువగా పంపించిన అదనపు బాలాలన్నీ పూర్తిగా చెదిరిపోయున్నాయి. ఇంతవరకు ఒక్క సైనికుడైనా అలహాబాద్ చేరుకోలేదు. ఈ స్థానాలను బలపర్చుకోవాలంటే ఇది అనివార్యమే కావచ్చు; అయినా కాకపోవచ్చు కూడా. ఏది ఏలావున్నప్పటికీ, రక్షించుకోవాల్సిన స్థానాల సంఖ్యను ఎంతవరకూ తగ్గించుకోడానికి వీలవుతుందో, అంతవరకూ తగ్గించుకునే తీరాలి; ఎందుచేతంటే, యుద్ధభూమిమీద జరపాల్సిన చర్యలకోసం సైనికబలాలను సాంద్రీకరించుకోవడం అత్యంత అవసరం. సి. [కాలిన్] కాంబెల్‌కు, ఇతడు ధైర్యసాహసాలుగల వ్యక్తి అనే తప్ప, అంతకంటె ఇతనిగురించి అధికం మనకేమీ తెలియదు, గొప్ప జనరల్‌గా కీర్తిని నిజంగా సంపాదించుకోవాలనే కోర్కె ఉంటే, coûte que coûte* ఢిల్లీని వదలుకున్నా సరే వదలుకోకపోయినా సరే, చలనశీలమైన సైన్యాన్ని అతడు నిర్మించుకుని తీరాలి. ఇకపోతే, 25,000 నుండి 30,000 వరకూ యూరపియన్ సైనికులు ఎక్కడున్నాసరే, తమకు కలిగే నష్టాలను ఇతర స్థలాలనుండి భర్తీచేసుకుంటూ, ఇతరచోట్లకు తరలివెళ్ళేందుకై అధమం 5,000 మందినైనా సమీకరించలేనంతటి నిరాశాజనకమైన దుస్థితిలో అతడు ఉండనే వుండడు. తన పరిస్థితులు ఎలాగున్నాయో, తన ముందున్న శత్రువు ఎలాటివాడో, అప్పుడు మాత్రమే తెలుసుకోగల్గుతాడు. అతను ira se blottir devant Delhi like a fool** తన వాళ్ళు at the rate of 100 a day*** హతులైపోతూన్నాసరే చూస్తూ, అందరూ చచ్చినాసరే ఉన్నచోటనుండి కదలకుండా ఉండడమే అన్నిటికంటే మరింతగా "క్షాత్రధర్మమని" అతడు పరిగణించడం however are the odds**** కాని, యుద్ధభూమికోసం పరాక్రమసహితమైన బుద్ధిమాంద్యమే ఈనాడు ఘనతగా చెలామణీ అవుతూంది.

---

* ఎంత మూల్యం చెల్లించి ఐనా సరే — అనువాదకుడు.

** ఢిల్లీముందు వెర్రివెంగళాయలాగు పిచ్చి యుద్ధంచేస్తూ — అనువాదకుడు.

*** రోజుకి 100 మంది చొప్పున — అనువాదకుడు.

**** ముప్పాతిక ముప్వీసం ఖాయము అనిపిస్తూంది — అనువాదకుడు.

క్షేత్రయుద్ధానికై బలాలను ఉత్తరాన సాంద్రీకరించుకోవడమూ, మద్రాసునుండి, వీలైతే బొంబాయినుండి కూడా, శక్తివంతమైన సహాయమూ — ఇవితప్ప మరేమీ అవసరంలేదు. నర్మదాతీరానున్న మహారాష్ట్ర సంస్థానాధీశులు ఒకవేళ జారుకున్నా కూడా, వాళ్ల సైనికులు ఎలాగా అప్పుడే తిరుగుబాటుదార్లతోనే చేరిపోయారు కాబట్టి పెద్ద ప్రమాదమేమీలేదు. ఏది ఎలావున్నా, అక్టోబరు ఆఖరుకి యూరప్‌నుండి అదనపు బలాలు వచ్చి చేరేవరకూ, ఇప్పుడున్న స్థానాలనే వదలుకోకుండా నిలబెట్టుకోడంకంటె అధికం దుస్సాధ్యమే.

కాని, మరో రెండు బొంబాయి రెజిమెంట్లు పితూరీ చేశాయంటే మాత్రం, దాంతో అసలు వ్యవహారమంతా అమీ తుమీ తేలిపోతుంది; ఎందుచేతంటే, శతఘ్నిబలాలకీ యుద వ్యూహాలకీ అప్పుడిక తావే ఉండదు....

# మార్క్స్‌పేర ఎంగెల్స్

3, ఎడ్వర్డ్ ప్లేస్, జెర్సీ, అక్టోబరు 29, 1857

...ఢిల్లీ enceinte* sepoys** నాశిగా రక్షించుకొని ఉండే ఉండాలి; అసలు తమాషా అంతా వీధుల్లో జరిగిన సంఘర్షణల్లోనే జరిగింది; ఈ సంఘర్షణల్లో native troops*** ముందుకు పంపించినట్టు కనబడుతూంది. అసలు ముట్టడంతా ఈ విధంగా 5 నుండి 14 వరకూ జరిగింది; తరువాత జరిగినది ఇక ముట్టడేకాదు. రక్షణలేకుండా వున్న కోటగోడల్నో, అదివరకే 5 నో 6 నో తీసుకొచ్చిన భారీ నౌకాఫిరంగులతో 300 ల గజాలు, 400 ల గజాల దూరంనుండి గండికొట్టడానికి ఈ వ్యవధే కావలసినంతగా సరిపోయింది. కోటగోడలమీద వున్న ఫిరంగులు ఏమంత బాగా ఉపయోగించబడినట్టు అవుపడదు, లేకుంటే అంత త్వరగా కోడగోడలను సమీపించడానికి ఇంగ్లీష్‌వారికి వీలైవుండేదికాదు....

---

* కోటగోడలు — అనువాదకుడు.

** సిపాయిలు — అనువాదకుడు.

*** దేశీయ సైనికబలాలు — అనువాదకుడు.

# మార్క్సుపేర ఎంగెల్స్

డిసెంబరు 31, 1857

ప్రియమైన మూర్,

ఇండియానుండి వార్తలున్న పత్రికలకోసమని పూరంతా గాలించాను; నా „Guardians"[106] పత్రికలు నీకు మొనన్నే పంపించేశాను. కావాల్సిన సంచికలు. "Guardian," "Examiner",[107] "Times" కార్యాలయాలలో కూడా దొరకలేదు; బెల్‌ఫీల్డ్ దగ్గర ఉన్న పత్రికలన్నీ అమ్ముడుపోయాయి. నువ్వు మంగళవారం పంపించాల్సిన వ్యాసం పూర్తిచేసి అప్పుడే పంపించేశావనే అనుకున్నాను. ఈ సందర్భాల్లో, ఈ వ్యాసం రాయడానికి నాకు సాధ్యపడదు; అందులోనూ, అవసరమైన వ్యవహారాలను వెనకపెట్టకుండా, గత నాలుగు వారాలనుండీ ఈ వ్యాసం రాయడానికి నాకు ఈ మధ్యాన్నమే మొదటి అవకాశం ఉండి ఉండడం నాకు విచారం కలిగిస్తూంది. మిలిటరీ వ్యాసాల విషయమై నీ ఉద్దేశ్యాలేమిటో భవిష్యత్తులో సాధ్యమైనంత ముందుగా నాకు తెలియజేస్తూండు. సరిగ్గా ఇప్పుడే ఇరవైనాలుగు గంటలంటే ఎంతో కాలంలా ఉంది నాకు.

ఏది ఏలావున్నా, సమాచారమే మహా తక్కువగా వుంది. ఇక ప్రతీదీ కూడా, కాన్పూర్ నుండి కలకత్తాకు పంపించిన టెలిగ్రాఫ్‌వార్తల మీదే ఆధారపడి ఉండడంచేత, వాటిని వ్యాఖ్యానించేందుకు ఇంచుమించు ఏమాత్రమూ వీల్లేకుండా వుంది. ముఖ్యమైన విషయాలన్నీ వివరిస్తున్నా: కాన్పూర్‌నుండి లక్నోకి (అలంబాగ్‌కి) 40 మైళ్ళు. హవ్‌లక్ చేసిన అధిక ప్రయాస మజిలీలనుబట్టి చూస్తే, ఇండియా పరిస్థితుల్లో రోజుకి 15 మైళ్ళ మజిలీ చాలా హెచ్చనే తెలుస్తూంది; అదైనా రోజులతరబడి చేయడమంటే అసాధ్యమే. ఈ విధంగా, కాలిన్‌కి* రెండు మూడు మజిలీలు చేయడమే అవసరమై ఉండడంచేత, ఏది ఏమైనప్పటికీ,

* కాంబెల్ — సం.

కాన్పూర్‌నుండి బయలుదేరిన మూడవనాటికల్లా, అలంబాగ్ చేరుకుని, with plenty of daylight still left to attack at once* అతనికి వీలయ్యే ఉంటుంది. దీన్నిబట్టే కాలిన్ యొక్క పురోగమనాన్ని విలువకట్టాల్సి ఉంటుంది; నాకు తేదీలు జ్ఞాపకం లేవు. రెండవది; అతడివెంట 7,000 మంది ఉన్నారు (ఇంతకు మించే ఉంటారని అనుకున్నారు, కాని కలకత్తానుండి కాన్పూర్‌కు తరలిరావడం అత్యంత ప్రయాసకరంగానే ఉండి, అనేకమందే చనిపోయి ఉండాలి); పోతే (అలంబాగ్, లక్నోల దుర్గరక్షకసైన్యాలను కలుపుకుని), 7,000 మందితోనే అతడు అయోధ్యావాసులను ఓడించగల్గాడంటే, అందులో పెద్ద ప్రజ్ఞ ఏమీలేదు. An army of 5000—7000 Englishmen has always been thought fully sufficient to go anywhere and do anything on the open field in India. That stamps the opponents at once** ఈ సందర్భంలో, గంగానది లోయలో నివసించుతూన్న జాతులవారందరిలోనూ, అయోధ్యావాసులే హెచ్చు ధైర్య సాహసాలను కలిగిన వారైనప్పటికీ, యూరపియన్ ఆర్గనైజేషనుకింద సరాసరి వారెప్పుడూ రాకపోవడం కారణంగా, క్రమశిక్షణా, సంఘటిత స్వభావమూ, ఆయుధాలూ, వీటిలో సిపాయిలకంటె బాగే తీసికట్టే అనే విషయాన్ని ఈ సందర్భంలో చెప్పాల్సి వుంది. కాబట్టి, ప్రధానయుద్ధమంతా was a running fight, that is to say a skirmishing engagement inwhich the Oudhians were pushed back from post to post. Now it is true, the British are, with the Russians, the worst light infantry in Europe, but they have learnt something in the Crimea, and at all events they had this great advantage over the Oudhians that their line of skirmishers was properly and regularly supported by pickets and lines, the whole under one individual commander and cooperating towards a single end; while their opponents

---

* వెంటనే దాడిచెయ్యడానికి ఇంకా పొద్దుబాగానే ఉండడానికి — అనువాదకుడు.

** 5,000 నుండి 7,000 వరకూ ఇంగ్లీష్ సైనికులుంటే, ఇండియాలోని వెల్లడి ప్రదేశంలో ఎక్కడకుపడితే అక్కడికివెళ్ళి, ఎటువంటి కార్యమైనా సాధించుకు రావడానికి పూర్తిగా సరిపడతారనే సర్వసాధారణంగా అందరూ నమ్ముతారు. ఇది శత్రువుని వెంటనే అణచిపారవేస్తుంది. — అనువాదకుడు.

in the normal Asiatic manner, dispersed in irregular clusters, everyone pressing to the front, thus offering a sixfold aim to the British, having no regular supports or reserves and each cluster commanded by its own clannish chief, acting independently of every other clan. For it must be repeated up to now we have not heard in a single instance that any insurrectionary army in India had been properly constituted under a recognized chief.* సమాచారవార్తలు ఈ యుద్ధం గురించి పైవిషయాలు తప్ప మరే వివరాలూ ఇవ్వడంలేదు. ఇంతేకాకుండా, యుద్ధభూమియొక్క నైసర్గిక స్వభావం గురించి ఎట్టి వర్ణనగాని, సైనిక బలాలను ఉపయోగించిన విధానం గుర్చి వివరాలుగాని వార్తల్లో ఏమీలేకపోవడంవల్ల ఇంతకంటె మరేమి (అందులోనూ జ్ఞాపకాన్నిబట్టి) చెప్పడానికీ నాకు వీల్లేకుండా వుంది...

* పరుగెత్తుతూ చేస్తూన్న సంఘర్షణ రూపంలోనే, అనగా అయోధ్యావాసులను ఒక స్థానాన్నుండి ఒక స్థానానికి వరసగా తరిమివేస్తూండగా జరిగిన స్వల్ప పోరాటంగానే జరిగింది. యూరప్ అంతటిలోనూ బ్రిటిష్, రష్యన్ తేలిక ఇన్‌ఫెంట్రీలే అన్నిటికంటే అత్యంత అధ్వానం అన్న విషయం నిజమే; కాని క్రైమియాలో కొన్ని గుణపాఠాలు వారు నేర్చుకున్నారు; ఏమైనప్పటికీ, బ్రిటిష్ శ్రేణులకు సరిగ్గానూ, వరుసక్రమంలోనూ గస్తీదళాల సహాయమూ, బారులుతీర్చిన సైనికపంక్తుల ఆసరా లభించి, సైన్యమంతా ఏకైకనాయకత్వం కింద ఉండి, ఒకేఒక లక్ష్యసాధనకై అందరూ సహకరించడంవల్ల, అయోధ్యావాసులపై వీరిదే పైచేయి అవడానికి గొప్ప అవకాశం లభించగా; మామూలు ఆసియాప్రజల్లాగే అయోధ్యావాసులు చిన్నచిన్న గుంపులుగా విడిపోయి, అందరూ ఒక్కుమ్మడిగా ముందుకు తోసుకుంటూండడంచేత, ఆరంతలు పెద్దదైన లక్ష్యం బ్రిటిష్‌వారికి లభించుతూ, అదనపు శ్రేణులుగాని సహాయశ్రేణులుగాని లేకుండా, ఏ గుంపుకాగుంపే ఆ గుంపుకుల పెద్దే నాయకత్వం వహించుతూ, కడమ గుంపులతో సంబంధంలేకుండా స్వతంత్రంగా పోరాడాయి. ఇండియాలో ఇంతవరకూవున్న ఏ తిరుగుబాటుదార్ల సైన్యమూ కూడా పేరుపొందిన నాయకునికింద సరైన విధంలో నిర్మాణయుతంగా ఏర్పడినట్టు ఒక్క దృష్టాంతమైనా మనమింత వరకూ వినివుండలేదని మనం మళ్లీ మరొకసారి చెప్పాల్సి వుంది. — అనువాదకుడు.

## ఎంగెల్స్‌పేర మార్క్స్

జనవరి 14,1858

...నీ వ్యాసం is splendid in style and manner.* కాగా వెనకటి "Neue Rheinische Zeitung"[108] రోజులన్నిటిలోనూ మంచి రోజులు జ్ఞాపకం తెచ్చింది. విండ్‌హామ్ గురించే చెప్పాలంటే, అతడు కేవలం చేతకాని జనరలే అయుండాలి; అయినా ఈ మాటు మాత్రం అతని దురదృష్టం కొద్దీ — రెడాన్ దగ్గిర అతని అదృష్టం కొద్దీ — సరికొత్త సైనికులను అతను యుద్ధంలోకి నడిపించాల్సి వచ్చింది. ఇంగ్లీష్‌వాళ్ళు ఇండియా దేశస్థులకి సమర్పించిన రెండో సేన — దీనిలో ఒక్కడు కూడా ప్రాణాలతో బైట పడడనుకో — ఇంచుమించు పూర్తిగా తుడిచిపెట్టుకుపోయిన మొదటి సేనతో, ధైర్యంలో కాని, ఆత్మవిశ్వాసంలోకాని, స్థైర్యంలోకాని పోల్చడానికే ఎక్కడా వీల్లేదనే మొత్తంమీద నా అభిప్రాయం. సైనికబలాలపై శీతోష్ణస్థితికిగల ప్రభావంమాటకొస్తే, నేను రాసిన వివిధవ్యాసాల్లో — సైనికవిభాగాన్ని నేను తాత్కాలికంగా నడిపిన రోజుల్లో — సరైన లెక్కలు చూపుతూ, ఇంగ్లీష్‌వారు తమ నివేదికలో అధికారయుతంగా తెలిపినదానికంటె మరణసంఖ్య చాలా హెచ్చుగానే ఉందని నిరూపించాను. Drain of men and bullion** వల్ల ఇంగ్లీష్‌వాళ్లకి కలిగిన విపరీతనష్టం దృష్ట్యా, ఇండియాయే అన్నిదేశాల్లోనూ మనకిప్పుడు ముఖ్యమైన మిత్రదేశమైంది....

---

* శైలిలోనూ రీతిలోనూ భేషుగ్గా వుంది — అనువాదకుడు.

** మనుష్యులూ పాళా వెండిబంగారాలూ ప్రవాహంగా తరలిపోవడం — అనువాదకుడు.

238

# ఎంగెల్స్‌పేర మార్క్స్

ఏప్రిల్ 9, 1859

...ఇండియా ఆర్థిక అవ్యక్తం ఇండియాలో తిరుగుబాటుయొక్క వాస్తవఫలితమనే ఎంచాల్సి వుంది. ఇంతవరకూ ఇంగ్లండుయొక్క స్థిరమైన సహాయకులుగావున్న వర్గాలపైనే ఇప్పుడు పన్నులు విధించుతేనే తప్ప, a general breakdown* అనివార్యంగానే కనబడుతూంది. ఇలా పన్నులు విధించినప్పటికీ, ఇదేమంతగా సహాయపడేట్టు కనబడ్డంలేదు. దీనిలో వున్న తమాషా అంతా ఏమిటంటే, ఈ యంత్రాన్ని చలనంలో ఉంచేందుకై సాలీనా 40, 50 లక్షల పౌన్ల చొప్పున జాన్ బుల్ ఇండియాలో నగదు చెల్లించుకుంటూనే, ఈ ముచ్చటైన డొంకటిరుగుడు మార్గంలో తన జాతీయరుణాన్ని కూడా తదనుగుణ్యంగా నిరవధికంగా అధికమయే ratio** అతడు పెంచుకోవాల్సి వుంటుంది. ఇండియా మార్కెట్టులో మాంచెస్టర్ నూలు వస్త్రాలు కటికధరలకే అమ్మి డబ్బు పిండుతున్నారని తప్పనిసరిగా ఒప్పుకునే తీరాలి. మిలిటరీ కమీషన్ నివేదికనుబట్టి, ఇండియాలో అనేక సంవత్సరాలవరకూ, 2 లక్షలనుండి 2 లక్షల 60 వేలవరకూ natives*** తోపాటు, 80,000 europeans**** కూడా ఉంచాల్సి వుంటుంది. దీనివల్ల about***** 2 కోట్ల పౌన్ల ఖర్చుపెట్టాల్సి ఉండగా,

* సంపూర్ణమైన అస్తవ్యస్తం — అనువాదకుడు.

** నిష్పత్తిలోనే — అనువాదకుడు.

*** దేశీయులు — అనువాదకుడు.

**** యూరపియన్‌లు — అనువాదకుడు.

***** సుమారు — అనువాదకుడు.

net revenue* కేవలం ఏ 25 కోట్ల పౌన్లు మాత్రమే ఉంటుంది. ఇంతేకాకుండా, తిరుగుబాటు ఫలితంగా permanent debt** 5 కోట్ల పౌన్లు అధికమైంది; లేక విల్సన్ అంచనా ప్రకారం, సాలీనా వస్తూన్న లోటు మరొక 30 లక్షలు అధికవౌతుందన్నమాట. దీనికితోడు guarantee in railways*** కోసం సాలీనా 20 లక్షల పౌన్లు చెల్లింపూ, ఒక వేళ వాటివల్ల వచ్చే net revenue 5 శాతానికి మించనట్టయితే శాశ్వతంగా ఇంతకంటె తక్కువ మొత్తం చెల్లింపూ, ఉండనేవుంది. ఈ వ్యవహారంలో ఇంగ్లీష్ పెట్టుబడిదార్లకు వారి పెట్టుబడిమీద 5 శాతం వడ్డీ చెల్లించుకునే భాగ్యం తప్ప, కాసింత మేర తయారైన రైల్వే మినహా, ఇండియాకు మరే ప్రతిఫలమూ ఇంతవరకూ ముట్టలేదు. అయితే జాన్ బుల్ తనకి తానే టోపీ వేసుకున్నాడు; సరిగ్గా చెప్పాలంటే, అతని పెట్టుబడి దార్లే అతన్ని టోపీ వేశారు. దీనిని నామకః ఇండియాయే చెల్లిస్తుంది; యథార్థంగా చెల్లించేది జాన్ బుల్లే. ఉదాహరణ నిర్మాణానికే, తామింకా శ్రీకారం చుట్టనట్టి రైల్వేలకుగాను పెట్టుబడిదార్లకు ముట్టవలసివున్న 5 శాతం వడ్డీలు చెల్లించడానికే స్టాన్లీ చేసిన loan**** లో కేవలం అధికభాగం ఉద్దేశించబడింది. చిట్టచివరకి, ఇంతవరకూ నల్లమందు పన్నువల్ల సాలీనా వసూలవుతూన్న 40 లక్షల పౌన్ల ఆదాయానికి, చైనాతో చేసుకున్న సంధి[109] వల్ల, గొప్ప ప్రమాదం ఏర్పడుతూంది. ఏమైనప్పటికీ, ఈ గుత్త వ్యాపారం బోల్తాకొట్టడం మాత్రం తప్పదు; చైనాలోనే నల్లమందు పంట అభివృద్ధి అవుతుంది. విశేషించబడిన ఎగుమతుల జాబితాలో నల్లమందు కూడా ఒక పద్దుగా చేర్చబడడమే కేవలం ఈ నల్లమందు ఆదాయానికి కారణం. ఇండియా యుద్ధంకంటె ఘోరమైన నేటి ఆర్థికవిపత్తే, అత్యంత భయానకమైన వ్యవహారమని నా అభిప్రాయం....

---

* నికరాదాయం — అనువాదకుడు.

** శాశ్వతరుణం — అనువాదకుడు.

*** రైల్వేలకు హామీ — అనువాదకుడు.

**** రుణం — అనువాదకుడు.

# వ్యాఖ్యలు

[1] ఈస్ట్ ఇండియా కంపెనీ అనుజ్ఞాపత్రం పొడిగించడం సందర్భంలో హౌస్ ఆఫ్ కామన్స్‌లో జరిగిన చర్చలు పురస్కరించుకుని మార్క్స్ ''ఇండియాలో బ్రిటిష్ పరిపాలన'' అనే పత్రికావ్యాసం రాశాడు. ఈ వ్యాసం "New-York Daily Tribune"లో ప్రచు రించబడింది.

"New-York Daily Tribune" 1841 నుండి 1924 వరకూ నడిచింది. ప్రముఖ అమెరికన్ పత్రికారచయిత, రాజకీయవేత్త అయిన హొరెస్ గ్రీలీ చేత స్థాపించబడి, ఈ పత్రిక పద్దెనిమిదివందల యాభైల మధ్య సంవత్సరాల వరకూ అమెరికన్ విగ్గులయొక్క వామపక్షపు పత్రికగా వుండి, తరువాత రిపబ్లికన్ పార్టీ పత్రిక అయింది. పద్దెనిమిదివందల నలభైలలోనూ, యాభైలలోనూ ఈ పత్రిక అభ్యుదకరమైన అభిప్రా యాలు కలిగివుండి, బానిసవ్యవస్థపట్ల తీవ్రమైన ప్రతిఘటనాస్థానం అవలంబించింది. ఈ పత్రికతో అమెరికన్ రచయితలలోనూ పత్రికారచయితలలోనూ అనేకమందికి దగ్గరసంబంధా లుండేవి. పద్దెనిమిదివందల నలభైల చివరి సంవత్సరాలలో పత్రిక సంపాదకులలో చార్లెస్ డానా ఒకడు. ఇతనిపై ఊహాజనిత సోషలిజం భావాల ప్రభావం చాలా బలంగా ఉండేది. ఈ పత్రికతో మార్క్స్‌కు 1851 ఆగస్టులో మొదటి సారిగా ఏర్పడిన సంబంధం, మార్చి 1862 వరకూ, పది సంవత్సరాలకుపైగా సాగింది. మార్క్స్ కోరికపైని ఎంగెల్స్ ఈ పత్రికకు అనేక వ్యాసాలు రాశాడు. అంతర్జాతీయ, దేశీయ విధానాలకు సంబంధించిన కీలక ప్రశ్నలను గురించీ, కార్మికోద్యమం, యూరపియన్ దేశాల ఆర్థికాభివృద్ధి, వలసవిధాన విస్తరణ, పీడిత పరాధీన దేశాల విముక్తి ఉద్యమాలు వగైరా సమస్యలను గురించీ మార్క్స్, ఎంగెల్స్‌లు తమ వ్యాసాలలో చర్చించారు. యూరప్‌లో అభివృద్ధినిరోధక కాలంలో, పెట్టుబడిదారీ సమాజంయొక్క దౌష్ట్యాలనూ, పరస్పర విరుద్ధమైన వైరుధ్యాలనూ బూర్జువా ప్రజాస్వామ్య

పరిమితులూ నిర్దిష్టమైన అధారాలూ చూపించుతూ బట్టబయలుచేయడానికి విస్తృత పాఠకవర్గం కలిగిన ఈ పత్రికను చక్కగా ఉపయోగించుకున్నారు.

మార్క్స్, ఎంగెల్స్‌లు రాసి పంపించిన వ్యాసాలలు కొన్నింటిలో "New-York Daily Tribune" సంపాదకులు స్వతంత్రించి అనేక మార్పులను చేసీ, అనేక వ్యాసాలను సంతకాలు లేని సంపాదకీయ వ్యాసాలుగానూ ప్రచురించారు. వ్యాసవాచకాలలో మార్పులనుచేసి, తమ ఇష్టాను సారంగా వ్యాసాల తేదీలను మార్పులను చేసిన ఉదాహరణలు కూడా ఉన్నాయి. దీని గురించి మార్క్స్ పదేపదే తన తీవ్ర ఆక్షేపణ తెలియజేశాడు. సంయుక్త రాష్ట్రాల్లో సంభవించిన ఆర్థికసంక్షోభం ఫలితంగా పత్రికయొక్క ఆర్థికపరిస్థితులు దెబ్బతినడంవల్ల, 1857 శరత్తులో మార్క్స్‌కు తాను పంపే వ్యాసాలసంఖ్యను తగ్గించుకొనక తప్పిందికాదు. అమెరికా అంత ర్యుద్ధం ప్రజ్వరిల్లిన మొదటిరోజుల్లో "New-York Daily Tribune"తో తనకున్న సంబంధాన్ని మార్క్స్ పూర్తిగా తెగతెంపులు చేసుకున్నాడు. బానిసయజమానులను కలిగినట్టి దక్షిణంతో రాజీని సమర్థించేవారు పత్రికా నిర్వహణలో పైచేయి సంపాదించుకోవడమే ఇందుకు ప్రధానకారణం; వీరి ప్రాబల్యం అధికమవడంతో తాను వెనుక తీసుకున్న అభ్యుదయ కరమైన స్థానాలకు పత్రిక స్వస్తిచెప్పింది. ఈ సంకలనానికి సంబంధించిన కాలంలో మార్క్స్, ఎంగెల్స్‌లు "New-York Daily Tribune"కు రాసిన వ్యాసాలు కొన్నింటిలో, ఆ పత్రికా సంపాదకులు విస్తృతమైన మార్పులనుచేసి ప్రచురించడంచేత, వాటిని ఈ సంకలనంలో చేర్చలేదు. పుట 15.

[2] టర్కీ సమస్య అని పేర్కొనడంలో ఆటోమన్ సామ్రాజ్యంపైన, అందులోనూ ప్రధానంగా దాని బాల్కన్ రాజ్యాలపైన, పలుకుబడిని సంపాదించడానికై పోటీ పడుతూన్న అగ్రరాజ్యాల మధ్య సుదూర ప్రాచ్యంలో సంభవించిన అంతర్జాతీయ స్పర్థలు అని మార్క్స్ ఉద్దేశ్యం. ఈ స్పర్థ చిట్టచివరకు, ఒక పక్షంగా రష్యాకూ, ప్రత్యర్థిపక్షంగా బ్రిటన్, ఫ్రాన్స్, టర్కీ, సార్డీనియాలకూ 1853–1856లో జరిగిన ప్రాచ్య, లేక క్రైమియా యుద్ధానికి దారితీసింది. సెవస్తొపోల్ ముట్టడి క్రైమియా యుద్ధానికి కీలకంగా పరిణమించింది; రష్యన్ నౌకా స్థావరమైన సెవస్తొపోల్ నల్లసముద్ర తీరాన్నుంది; సెవస్తొపోల్ ముట్టడి పదకొండు నెలలుపాటు సాగి, చివరకు ఆ పట్నం లొంగిపోవడంతో అంతమైంది. కాని సెవ స్తొపోల్ దుర్గరక్షకసేన సాగించిన తీవ్రమైన మొండి ప్రతిఘటన ఫలితంగా బ్రిటిష్-ఫ్రెంచి-టర్కీ సేనలు బలహీనపడ్డాయి. ఎదురుదెబ్బ తీయడానికి వాటికి మరి శక్తి లేకపోయింది. 1856 పారిస్ శాంతి సంధిపై సంతకాలు జరగడంతో యుద్ధం అంతమైంది.

1848–1849 జాతీయ విముక్తి ఉద్యమంలో పాల్గొన్నవారికి పీడ్‌మాంట్

(సార్డీనియా) రాజ్యం శరణు ఇవ్వడం కారణంగానూ, 1853 ఫిబ్రవరి 6 న జరిగిన మిలాన్ తిరుగుబాటుకు కారకులైన లొంబార్డీ (అప్పట్లో ఆస్ట్రియాకింద వుంది) నుండి వలసపోయినవారికి కూడా పీడ్‌మాంట్ శరణు ఇవ్వడం కారణంగానూ, పీడ్‌మాంట్‌తో ఆస్ట్రియా దౌత్యసంబంధాలు తెగతెంపుచేసుకోడం ఫలితంగా సార్డీనియా సమస్య తలయెత్తింది.

ఇటలీ జాతీయవిముక్తి ఉద్యమంలో పాల్గొని అనాడు ఆస్ట్రియా పరిపాలన కింద వుండిన ఇటలీలోని జిల్లాలనుండీ, ప్రత్యేకంగా లొంబార్డీనుండీ వలసపోయినవారూ, అందులోనూ ముఖ్యంగా, విఫలమైనట్టి 1853 ఫిబ్రవరి 6 న జరిగిన తిరుగుబాటులో పాల్గొన్నవారూ, స్విట్జర్లెండ్ కాంటాన్ అయిన టెస్సిన్‌లో నివాసం ఏర్పరచుకుని ఉండడం కారణంగా, 1853 లో ఆస్ట్రియా, స్విట్జర్లెండ్‌ల మధ్య ఏర్పడ్డ తగాదానే మార్క్స్ స్విట్జర్లెండ్ సమస్య అని పేర్కొన్నాడు. పుట 15.

[3] ఈస్ట్ ఇండియా కంపెనీయొక్క 1833 అనుజ్ఞాపత్ర కాలం అంతమైపోవడం వల్ల, వారికి తిరిగి కొత్త అనుజ్ఞాపత్రం జారీచేసే చట్టం గూర్చి హౌస్ ఆఫ్ కామన్స్‌లో జరిగిన చర్చను ఇది ఉదాహరిస్తూంది. 1600 లో స్థాపితమైన బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ, ఇండియాలో బ్రిటిష్ వలసరాజ్య విధానంయొక్క పనిముట్టుగా ఏర్పడింది. మొదటి నుండీ ఇండియా, చైనా వర్తకంలో గుత్తాధిపత్యం కలిగిన కంపెనీ పేరిట బ్రిటిష్ పెట్టుబడిదార్లు సాగించిన ఇండియా దిగ్విజయం 19 వ శతాబ్ది మధ్యలో పూర్తి అయింది. జయించిన భూభాగాలను కంపెనీ అదుపాజ్ఞల్లోకి తెచ్చుకొని, వాటిని పరిపాలించి, సివిల్ ఉద్యోగులను నియమించి, పన్నులు వసూలు చేస్తూండేది. నియమితకాలల్లో పార్లమెంటుచే పొడిగించబడుతూండిన అనుజ్ఞాపత్రాల్లో కంపెనీకుండిన వాణిజ్య, పరిపాలనాధికారాలు నిర్వచించబడుతూండేవి. 19 వ శతాబ్ది మధ్యకాలం నాటికి కంపెనీ వర్తకంయొక్క ప్రాముఖ్యత క్రమేణా క్షీణించిపోయింది. 1813 లో జరిగిన పార్లమెంటు చట్టం కంపెనీకుండిన ఇండియా వర్తక గుత్తాధిపత్యాన్ని రద్దుచేసింది. తేయాకు వర్తకంలోనూ, చైనా వర్తకంలోనూ కంపెనీకుండిన గుత్తాధిపత్యాన్ని మాత్రమే నిలబెట్టింది. 1833 అనుజ్ఞాపత్రంతో కంపెనీకుండిన అన్ని వాణిజ్యపు విశేషాధికారాలూ రద్దుకాబడి, 1853 అనుజ్ఞాపత్రంతో ఇండియా పరిపాలనలో కంపెనీకుండిన గుత్తాధికారం కూడా కొంతవరకు తగ్గించబడింది. బ్రిటిష్ రాజమకుటంయొక్క మరింత అధికమగు ఖాయిదా కింద ఈస్ట్ ఇండియా కంపెనీ ఉంచబడింది. ఉద్యోగుల నియామకంలో కంపెనీ డైరెక్టర్లకుండిన అధికారం అంతమైపోయింది. డైరెక్టర్లసంఖ్య 24 నుండి 18 కి తగ్గించబడి, వీరిలో ఆర్గురిని రాజమకుటం పేరిట ప్రభుత్వమే నియమించుతూండేది. బోర్డ్ ఆఫ్ కంట్రోల్ ప్రెసిడెంట్‌యొక్క హోదాను

స్క్రెటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా హోదాతో సమానంచేయబడింది. ఇండియాలో వున్న బ్రిటిష్ రాజ్య భూభాగాలపై కంపెనీకుండిన ఏలుబడి అధికారం మాత్రం 1858 వరకూ నిలిచివుంది; కాని చిట్టచివరకు 1858 లో ఇది కూడా రద్దు అయిపోయి, ఇండియా పరిపాలన సరాసరి బ్రిటిష్ రాజ్యాధికారం కిందకు వచ్చేసింది. పుట 15.

[4] కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ — కంపెనీయొక్క పాలకవర్గం. కంపెనీయొక్క వాటాదార్లలో 2,000 పౌన్ల వాటాలకు తక్కువ కాకుండా వాటాలను కలిగి మంచి పలుకుబడిగల వారినుండీ, ఇండియాలో బ్రిటిష్ ప్రభుత్వంకింద ఉద్యోగులైవుండినవారినుండీ వీరిని ఎన్నుకోవడం జరిగేది. కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ కార్యస్థానం లండన్‌లో ఉండేది; కంపెనీ వాటాదార్ల సర్వసభ్య సమావేశంలో (కోర్ట్ ఆఫ్ ప్రొప్రైటర్స్) డైరెక్టర్ల ఎన్నిక జరిగేది; ఈ సమావేశంలో 1,000 పౌన్ల వాటాలకంటె తక్కువకాకుండా వున్న వాటలు కలిగినవుండిన వాటాదార్లకే ఎన్నికలో వోటింగు అర్హత ఉండేది. 1853 వరకూ కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్‌కు ఇండియాలో విస్తృతాధికారాలుండేవి. 1858 లో ఈస్ట్ ఇండియా కంపెనీ అంతమై పోవడంతో ఇది కూడా రద్దు అయిపోయింది. పుట 15.

[5] 1853 జూన్‌లో ఈస్ట్ ఇండియా కంపెనీ కొత్త అనుజ్ఞాపత్రంపై జరిగిన పార్లమెంటు చర్చలో, బోర్డ్ ఆఫ్ కంట్రోల్ ప్రెసిడెంటు అయిన చార్లెస్ వుడ్, ఇండియా వృద్ధి పొందుతూందనే ఉద్ఘాటించాడు. తాను చెప్పినది నిజమని రూఢిపర్చడానికి, 1739 లో పర్షియాదేశపు విజేత నాదిర్ షా (కూలీ ఖాన్) ఢిల్లీని కొల్లగొట్టి నాశనంచేసిన కాలంలో ఆ పట్నంయొక్క స్థితినీ, ఆ పట్నంయొక్క సమకాలీనస్థితినీ సరిపోల్చాడు. పుట 16.

[6] సప్తరాజ్యకూటం (ఏడుగురు రాజుల పరిపాలన) — మధ్యయుగపు తొలి సంవత్సరాలలో ఇంగ్లండుదేశం ఏడు ఆంగ్లో-సాక్సన్ రాజ్యాలుగా (6 వ శతాబ్దినుండి 8 వ శతాబ్ది వరకూ) చీలివుండిన ఇంగ్లండు రాజకీయ వ్యవస్థకు ఇంగ్లీషు చరిత్రకారులు ఇచ్చిన పేరు; మహమ్మదీయులచే డక్కన్ జయించబడిన కాలానికిముందు, ఆ దేశంయొక్క ఫ్యూడల్ విభజనస్థితిని సాదృశ్యంగా నిరూపించడానికై మార్క్స్ ఈ పదాన్ని వాడాడు. పుట 16.

[7] Laissez faire, laissez aller (ఆలా ఉండనిమ్ము, నిర్నిబంధమగు స్వేచ్ఛ) — స్వేచ్ఛావ్యాపారాన్నీ, ఆర్థిక సంబంధాలలో ప్రభుత్వం జోక్యం కలుగజేసుకొనగూడదనీ సమర్థించే బూర్జువా స్వేచ్ఛావ్యాపార ఆర్థికశాస్త్రవేత్తల సాంకేతికం. పుట 18.

సాహిత్యం

[8] 1812 లో ప్రచురించబడిన హౌస్ ఆఫ్ కామన్స్ అధికారయుత నివేదికనుండి మార్క్స్ ఉల్లేఖించుతున్నాడు; G. Campbell, "Modern India: a Sketch of the System of Civil Government," London, 1852, pp. 84–85. (జి. కాంబెల్ ''ఆధునిక ఇండియా: సివిల్ ప్రభుత్వ చిత్రణ,'' లండన్, 1852, పుటలు: 84–85) అనే గ్రంథంనుండి ఉల్లేఖన. పుట 21.

[9] ప్రతిభావంతమైన విప్లవం – 1688 లో రాజ్యాంగంపై తీసిన దెబ్బకు ఇంగ్లీష్ బూర్జువా చరిత్రకారులు ఇచ్చిన పదం. దీని ఫలితంగా అభివృద్ధినిరోధక భూస్వామ్యవర్గం యొక్క సహాయంతో పరిపాలించిన రెండవ జేమ్స్‌ను కూలదోసి, ఆరంజ్ ప్రభువైన మూడవ విలియమ్‌ను రాజుగా నియమించారు. ప్రధాన భూస్వామ్య పారిశ్రామికాధిపతుల ప్రయోజనాల తోనూ, అగ్రవాణిజ్యవేత్తల ప్రయోజనాలతోనూ మూడవ విలియమ్‌కు సంబంధాలుండేవి. 1688 చర్య ఫలితంగా పార్లమెంటుకున్న అధికారాలు విస్తృతమై, క్రమేణ దేశపరిపాలనలో సార్వభౌమాధికార సంస్థగా పార్లమెంటు రూపొందింది. పుట 25.

[10] సప్తవర్ష సంగ్రామం (1756–1763) – యూరప్‌లోని రెండు మిత్రమండలు లకు – ఆంగ్లో-ప్రష్యన్, ఫ్రెంచి-రష్యన్-ఆస్ట్రియన్ – జరిగిన యుద్ధం. ఇంగ్లండుకీ ఫ్రాన్సుకీ మధ్య వలసరాజ్య, వాణిజ్య స్పర్థలే ఈ యుద్ధానికి ముఖ్యకారణం. నౌకాయుద్ధాల మాట అటుండగా, ఉభయ రాజ్యాలకూ అమెరికా ఆసియా ఖండాలలో వున్న వలసరాజ్యాలలోనే ప్రధానంగా యుద్ధం జరిగింది. ప్రాచ్యంలో ఇండియా ప్రధాన యుద్ధరంగంగా ఏర్ప డింది; ఇక్కడ ఫ్రాన్సు, ఫ్రాన్సుకింద సామంతులుగా వున్న స్వదేశ సంస్థానాధిపతులకూ, ఈస్ట్ ఇండియా కంపెనీకీ యుద్ధం జరిగింది. ఈస్ట్ ఇండియా కంపెనీ తన సైనికబలాలను గణ నీయంగా వృద్ధిచేసుకుని, యుద్ధాన్ని అవకాశంగా తీసుకుని ఇండియాలోని అనేక రాజ్యభాగా లను కాజేసింది. సప్తవర్ష సంగ్రామ ఫలితంగా, ఇండియాలో తనకున్న ప్రదేశాలలో ఇంచు మించు అన్నింటినీ (తీరప్రాంత నగరాలు ఐదు మినహా; కాని వీటి దుర్గరక్షణ నిర్మాణాలను నాశనంచేయక ఫ్రాన్సుకు తప్పిందికాదు) ఫ్రాన్సు కోల్పోయింది; ఇంగ్లండుయొక్క వలసరాజ్య శక్తి విస్తారంగా బలపడింది. పుట 26.

[11] J.Mill. "The History of the British India" (జె. మిల్ ''బ్రిటిష్ ఇండియా చరిత్ర''). ఈ గ్రంథం మొదటి కూర్పు 1818 లో వెలువడింది. ఇక్కడ ఉల్లేఖించబడిన ఖండం ఈ గ్రంథం 1858 కూర్పు, 5 వ సంపుటం, 6 వ భాగం, పుటలు

60, 65 నుండి సంగ్రహించబడింది; బోర్డ్ ఆఫ్ కంట్రోల్‌యొక్క విధులనుగూర్చి రాసినది కూడా మిల్ గ్రంథంనుండే (1858 కూర్పు, 4 వ సంపుటం, 5 వ భాగం, పుట 395) ఉల్లేఖించబడింది. పుట 27.

[12] జాకొబిన్ వ్యతిరేక యుద్ధం – 1793 లో విప్లవ ఫ్రాన్సుకు వ్యతిరేకంగా ఇంగ్లండు ప్రారంభించిన యుద్ధం; యుద్ధం జరిగిన కాలంలో విప్లవాత్మక ప్రజాతంత్ర పక్షంవారైన జాకొబిన్‌లు ఫ్రాన్సులో అధికారమందున్నారు. జాకొబిన్‌లపై ఇంగ్లండు ప్రారంభించిన ఈ యుద్ధం నెపోలియన్ సామ్రాజ్యంపైన కూడా సాగింది. పుట 28.

[13] సంస్కరణ చట్టం హౌస్ ఆఫ్ కామన్స్‌కు సభ్యులను పంపే విధాన్ని మార్పు చేసింది; 1832 జూన్‌లో చట్టం కావించబడింది. సంస్కరణ చట్టంయొక్క లక్ష్యం ఆర్థికంగా బలంకల్గి వుండిన భూస్వామ్య, ధనిక ప్రభువర్గంయొక్క రాజకీయ గుత్తాధిపత్యంపై దెబ్బతీయడం; కాగా ఇది పారిశ్రామిక బూర్జువావర్గానికి పార్లమెంటులో ప్రవేశం కల్గించింది. సంస్కరణకోసం పోరాటాన్ని సాగించడంలో అత్యంత ప్రముఖ పాత్రను వహించినట్టి శ్రామిక, పెట్టీబూర్జువావర్గాలను లిబరల్ బూర్జువావర్గం మోసగించింది; ఫలితంగా శ్రామిక, పెట్టీబూర్జువావర్గాలకు ఏవిధమైన ఎన్నిక హక్కులూ లభించలేదు. పుట 28.

[14] ఇండియాలోని భూభాగాలను చేజిక్కించుకొనడమూ తనతో పోటీచేస్తూన్న ఫ్రెంచి ఈస్ట్ ఇండియా కంపెనీని నాశనంచేయడమూ ఉద్దేశాలతో ఈస్ట్ ఇండియా కంపెనీ చేసిన రాజ్యవిస్తరణ యుద్ధాల జాబితాను మార్క్స్ పేర్కొంటున్నాడు.

కర్ణాటక యుద్ధాలు 1746 నుండి 1763 వరకూ అప్పటప్పుట జరిగాయి. కర్ణాటక రాజ సింహాసనానికై స్థానికంగా వున్న వివిధవారసుల పక్షం వహించి వారిని బలపరచడమనే విషపై యుద్ధంలో స్పర్థాళులైన ఉభయపక్షాలూ – బ్రిటిష్, ఫ్రెంచి వలస రాజ్యాలవారు – కర్ణాటాన్ని తమ అధీనంలోకి తెచ్చుకొనడానికి ఈ యుద్ధాన్ని సాగించారు. ఫ్రెంచి అధీనంలోవున్న ప్రాంతాలన్నిటికీ ముఖ్యమైన పుదుచ్చేరినగరాన్ని 1761 జనవరిలో బ్రిటిష్‌వారు ఆక్రమించుకున్నారు; చిట్టచివరకు బ్రిటిష్‌వారికే జయం లభించింది.

1756 లో, బ్రిటిష్‌వారు సాగింపనున్న దండయాత్రను నివారించడానికై, బెంగాల్ నవాబు బ్రిటిష్‌వారిపై యుద్ధం ప్రారంభించి, బ్రిటిష్‌వారి అధీనంలోవున్న ఈశాన్య ప్రాంతాలకు ప్రాతిపదిక స్థానమైన కలకత్తాను పట్టుకున్నాడు. కాని క్లైవ్ నాయకత్వాన వున్న ఈస్ట్ ఇండియా కంపెనీ సైనికబలాలు కలకత్తాను తిరిగి పట్టుకొని, బెంగాల్‌లో వున్న ఫ్రెంచి

వారు కొట్టిన కోటలను ధ్వంసంచేసి, 1757 జూన్ 23 న ప్లాసీయుద్ధంలో నవాబును ఓడించారు. కంపెనీవారు తమ సామంత రాజ్యంగా చేసుకున్న బెంగాల్‌లో 1763 లో తిరుగుబాటు జరుగగా, కంపెనీవారు దానిని అణచివేశారు. బెంగాల్‌తోపాటుగా, బెంగాల్ నవాబు పరిపాలనకింద వున్న బీహార్‌ను కూడా ఇంగ్లీష్‌వారు ఆక్రమించుకున్నారు. అదివరకే కంపెనీ తనకింద సామంతులనుగా లోబరచుకొన్న స్థానిక ఫ్యూడల్ రాజ్యాలు అనేకంగా వున్నట్టి ఒరిస్సా రాష్ట్రాన్ని 1803 లో కంపెనీ పూర్తిగా జయించివేసింది.

వెనుక మైసూర్‌లో బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా జరిగిన యుద్ధాల్లో వారికి వ్యతిరేకంగా యుద్ధం చేసినట్టి, బ్రిటిష్ వలసవిధానానికి గర్భశత్రువు అయినట్టి టిప్పు సాహెబు రాజ్యమైన మైసూర్‌పై 1790–1792 లోనూ, 1799 లోనూ ఈస్ట్ ఇండియా కంపెనీ యుద్ధం చేసింది. మొదటి యుద్ధంలో కంపెనీ, కంపెనీయొక్క మిత్రులు ఫ్యూడల్ సంస్థానాధీశులూ మైసూర్ రాజ్యంలో సగం భాగాన్ని తమ వశంచేసుకోవడంవల్ల మైసూరు అర్ధభాగం కోల్పోయింది. రెండవ యుద్ధంలో మైసూరుకి పూర్తిగా ఓటమి సంభవించి, యుద్ధంలో టిప్పు మరణించడంతో ఆ యుద్ధం ముగిసింది. మైసూర్ ఒక సామంత రాజ్యమైపోయింది.

సైన్యసహకార విధానం, (సబ్సిడియరీ సిస్టమ్), లేక సహకార ఒప్పందాలు అని చెప్పబడిన – ఇండియాలో వున్న స్వతంత్ర సంస్థానాధీశులను ఈస్ట్ ఇండియా కంపెనీకింద సామంతులనుగా మార్చివేయడానికై అవలంబించబడిన ఒక విధానం. ఈ ఒప్పందాలలో అత్యంత విస్తృతములైనవి, సంస్థానాధీశులు తమ రాజ్యాలలో కంపెనీయొక్క సైన్యాలను ఉంచుకొని వాటికైయే ఖర్చులను భరించడానికి (ముజరా ఇవ్వడానికి) షరతులు కల్గిన ఒప్పందాలూ, బాధాకరములైన నిబంధనలకింద అప్పులను సంస్థానాధీశులపై రుద్దిన ఒప్పందాలూనూ. ఈ ఒప్పందాలను నెరవేర్చలేకపోవడం వల్ల, సంస్థానాధీశుల రాజ్యాలను కంపెనీ జప్తుచేసి భుక్తంచేసుకోడానికి ఈ ఒప్పందాలు దారితీశాయి. పుట 28

[15] ఆఫ్ఘనిస్థానాన్ని ఆక్రమించుకునే ఉద్దేశ్యంతో బ్రిటిష్‌వారిచే ప్రారంభించబడినట్టి 1838–1842 మొదటి ఆంగ్లో-ఆఫ్ఘన్ యుద్ధం బ్రిటిష్ వలసవిధానవాదుల పూర్తి విఫలతతో అంతమైంది.

1843 లో బ్రిటిష్ వలసవిధానవాదులు సింధు రాష్ట్రాన్ని ఆక్రమించుకున్నారు. 1838–1842 ఆంగ్లో-ఆఫ్ఘన్ యుద్ధకాలంలో, సింధు రాష్ట్ర ఫ్యూడల్ పరిపాలకులపై, తమ రాష్ట్రంగుండా బ్రిటిష్ సైనిక బలాలను వెళ్లనివ్వవలసినదిగా అనుమతించవలసిందని ఈస్ట్ ఇండియా కంపెనీ బెదరింపులూ బలాత్కారమూ ఉపయోగించి అడి

గింది. దీనిని సాకుగాతీసుకుని, స్థానిక రాజులు కంపెనీకింద సామంతులుగా ఉండేందుకు అంగీకరించుతూ వారు ప్రకటించాల్సిందని వారిని కంపెనీ 1843 లో నిర్బంధంగా కోరింది. బలూచీ తెగలవారు కంపెనీపై తిరుగుబాటు చేయగా, ఈ తిరుగుబాటును అణచివేసిన తరువాత ఈ ప్రాంతమంతా బ్రిటిష్ ఇండియాలో కలిపివేయబడినట్టు కంపెనీ ప్రకటించింది.

1845–1846, 1848–1849 లో బ్రిటిష్‌వారు సిక్కులపై జరిపిన యుద్ధాలలో, బ్రిటిష్‌వారు పంజాబ్‌ను జయించారు. ఇండియాదేశపు ఫ్యూడల్ సంస్థానాధిపతులకూ, ఆఫ్ఘన్ దురాక్రమణదారులకూ వ్యతిరేకంగా 17 వ శతాబ్దాంతంలో తలయెత్తిన రైతు ఉద్యమానికి, సిక్కుమతం బోధించే సమానత్వం (సనాతన హిందూ, మహమ్మదీయ మతాల రెండింటినీ సమన్వయపరచడానికి వారు చేసిన యత్నం) భావశాస్త్రంగా ఏర్పడింది. కాలక్రమేణ, సిక్కులలోనుండి ఫ్యూడల్‌వర్గం ఒకటి బయలుదేరి, ఈ వర్గం యొక్క ప్రతినిధులు సిక్కు రాజ్యాధినేతలయారు. 19 వ శతాబ్ది తొలియేళ్లలో, సిక్కు రాజ్యం పంజాబ్ అంతటిపైనా, ఇరుగు పొరుగునున్న అనేక ప్రాంతాలపైనా విస్తరించింది. 1845 లో, తమతో సిక్కులు తగవు పెంచుకొనేందుకై సిక్కు అగ్రవర్గాలవారిలో వున్న దేశద్రోహుల సహాయాన్ని బ్రిటిష్ వలసవిధానవాదులు సంపాదించుకుని, ఫలితంగా 1846 లో సిక్కు రాజ్యాన్ని తమకింద సామంతరాజ్యంగా చేసుకోగల్గారు. 1848 లో సిక్కులు తిరుగుబాటు చేశారు, కాని 1849 లో బ్రిటిష్‌వారు సిక్కులను పూర్తిగా లొంగదీసేశారు. పంజాబ్‌ను జయించివేయడంతో ఇండియా యావత్తూ బ్రిటిష్ వలసరాజ్యంగా మారిపోయింది. పుట 29.

[16] T. M. [un], "A Discourse of Trade, from England into the East-Indies: Answering to Diverse Objections Which Are Usually Made Against the Same," London, 1621. (టి. ఎమ్[మన్] "ఇంగ్లండు ఈస్ట్ ఇండియాలమధ్య జరుగుతూన్న వర్తకంపై ఒక ప్రసంగం: దీనికి వ్యతిరేకంగా మామూలుగా చెప్పబడుతూన్న అభ్యంతరాలకు సమాధానాలు," లండన్, 1621). పుట 30.

[17] [Josiah Child], "A Treatise Wherein is Demonstrated I. That the East-India Trade is the Most National of All Foreign Trades," London, 1681. ([జోసియా చైల్డ్], "విదేశ వర్తకాలన్నిటికంటె ఈస్ట్ ఇండియా వర్తకమే అత్యంత జాతీయమైనదనే విషయాన్ని నిరూపించుతూన్న ఒక

గ్రంథం," లండన్, 1681.) రచయిత φιλοπατρις (దేశభక్తుడు) అనే మారుపేరుతో పుస్తకాన్ని ప్రచురించాడు. పుట 30.

[18] [John Pollexfen], "England and East-India Inconsistent in Their Manufactures. Being an Answer to a Treatise, Entitled, An Essay on the East-India Trade," London, 1697. ([జాన్ పోల్లెక్స్‌ఫెన్,] "ఇంగ్లండు ఇండియాల పరిశ్రమలలో ఉన్న అసంగతం. ఈస్ట్ ఇండియా వర్తకం అనే పేరుగల ఒక గ్రంథానికి సమాధానం," లండన్, 1697.) పుట 30.

[19] బ్రిటిష్ వలసాధికారులు బర్మాను జయించడానికి 19 వ శతాబ్ది ప్రారంభంలో మొదలుపెట్టారు. 1824–1826 లో జరిగిన మొదటి బర్మా యుద్ధంలో ఈస్ట్ ఇండియా కంపెనీయొక్క సైనికబలాలు బెంగాల్ సరిహద్దుననున్న అస్సాం రాష్ట్రాన్ని, తీర ప్రాంత జిల్లాలు అరకాన్, టెన్నాసరిమ్‌లను ఆక్రమించుకున్నాయి. పెగూ రాష్ట్రం ఆక్రమించుకోడంతో రెండవ బర్మా యుద్ధం (1852) అంతమైంది. రెండవ బర్మా యుద్ధం అంతమయేసరికి సంధి ఏదీ జరగపోవడం వల్లనూ, 1853 ఫిబ్రవరిలో రాజ్యానికొచ్చిన కొత్త బర్మారాజు పెగూ రాష్ట్ర ఆక్రమణను గుర్తింప నిరాకరించినందువల్లనూ 1853 లో తిరిగి యుద్ధం ప్రారంభమవుతుందనే అనుకున్నారు. పుట 34.

[20] J. Dickinson, "The Governmet of India under a Bureaucracy," London-Manchester, 1853, p. 50 (జె. డికిన్‌సన్, "ఉద్యోగి వర్గ పరిపాలనకింద ఇండియా పరిపాలన," లండన్, మాంచెస్టర్, 1850, పుట 50.) ఇండియా సంస్కరణ సమాజంవారి ప్రచురణ, (India Reform) సంపుటి VI. పుట 34.

[21] 17 వ శతాబ్ది మధ్యలో విదేశీయులైన మొగల్ ఫ్యూడల్ భూస్వామ్య ప్రభువుల ప్రాబల్యంపై మహారాష్ట్రులు సాయుధ తిరుగుబాటు లేవనెత్తి, మొగల్ సామ్రాజ్యంపై గొప్ప దెబ్బ తీశారు; ఈ దెబ్బే తదుపరి జరిగిన మొగల్ పతనానికి దారితీసింది. ఈ పోరాటం ఫలితంగా స్వతంత్ర మహారాష్ట్ర రాజ్యం అవతరించి, ఈ రాజ్యానికి చెందిన ఫ్యూడల్ ప్రభువులు రాజ్యవిస్తరణ యుద్ధాలు చేయడం మొదలుపెట్టారు. ఫ్యూడల్ అంతఃకలహాల ఫలితంగా 17 వ శతాబ్దాంతంలో మహారాష్ట్ర రాజ్యం బలహీనపడింది; కాని పీష్వా అధి

పత్యాన బలోపేతమైన మహారాష్ట్ర సంస్థానాల సమాఖ్య ఒకటి రూపొందింది. ఇండియాలో సార్వభౌమాధిపత్యానికై ఆఫ్ఘన్‌లతో మహారాష్ట్రులు పోటీపడ్డారు; 1661 లో మహారాష్ట్రులు తీవ్రపరాజయం పొందారు. ఇండియాలో ప్రాబల్యానికై జరిపిన పోరాటాలవల్లనూ, ఫ్యూడల్ ప్రభువుల అంతఃకలహాలవల్లనూ మహారాష్ట్ర సంస్థానాధీశులు తీరని జననష్టాన్ని పొందిన ఫలితంగా, ఈస్ట్ ఇండియా కంపెనీ విజృంభణకు వారు నిలబడలేకపోయారు; 1803–1805 లో జరిగిన మహారాష్ట్ర యుద్ధంలో వీరిని కంపెనీ ఓడించి లొంగదీసేసుకుంది. పుట 35.

[22] జమీందారీ, రైత్వారీ పద్ధతులు – 18 వ శతాబ్దాంతమందూ, 19 వ శతాబ్దారంభంలోనూ బ్రిటిష్ అధికారులు ఇండియాలో ప్రవేశపెట్టిన పద్ధతులు. మొగల్ పాదుషాల కింద, పీడితులైన రైతాంగంనుండి తాను వసూలు చేసిన శిస్తులలో కొంత నిర్ణీత భాగాన్ని ప్రభుత్వానికి చెల్లించివేస్తూన్నంత కాలమూ వంశపారంపర్యా భూస్వామ్యపు హక్కును అనుభవించుతూన్న జమీందారునే, 1793 శాశ్వత జమీందారీ శాసనం భూఖామందుగా చేసింది; దీని ఫలితంగా వీరు బ్రిటిష్ వలసాధికారుల వర్గసహాయకులుగా తయారయారు. బ్రిటిష్‌వారు ఇండియాలో తమ పరిపాలనను విస్తరించినకొద్దీ, జమీందారీ విధానాన్ని కొద్ది మార్పులతో బెంగాల్, బీహార్, ఒరిస్సాలకేకాకుండా, సంయుక్త, మధ్య, రాష్ట్రాలకూ, మద్రాసు రాష్ట్రంలో ఒక భాగానికీ వర్తింపజేశారు. ఈ పద్ధతిని ప్రవేశపెట్టిన ప్రాంతాల్లో, ఇంతవరకూ గ్రామసంఘంలో సమాన ప్రతిపత్తిని గలిగిన వ్యవసాయదార్లు ఇప్పుడు జమీందారుకింద రైతులుగా మారిపోయారు. 19 వ శతాబ్దారంభంలో మద్రాసు, బొంబాయి రాజధానులలో ప్రవేశపెట్టిన రైత్వారీ విధానాన్ననుసరించి, రైతులు ప్రభుత్వ భూమిని సాగుచేసే పట్టాదార్లుగా చేయబడి, బ్రిటిషు పరిపాలనాధికారులచే నిరంకుశంగా నిర్ణయించబడిన శిస్తు పన్నును రైతులు తాము సాగుచేస్తూన్న భూములపై చెల్లించాల్సినవారయారు. అదేసమయంలో, రైతులు కౌలుకుతీసుకున్న భూములకు వారు రైతాంగపు భూస్వాములని చెప్పబడ్డారు. న్యాయశాస్త్ర దృష్ట్యా స్వవచనవ్యాఘాతంగా వున్న ఈ భూమిపన్ను పద్ధతి ఫలితంగా, భూమిపన్ను ఎంత అధికంగా హెచ్చించబడిందంటే, ఇక రైతులు చెల్లించుకోలేని స్థితిలో పడిపోయారు. ఇందువల్ల రైతులు బకాయిలు పడిపోగా, వారి భూములు అధికలాభాలు సంపాదించేవారి చేతుల్లోకీ, అధికవడ్డీ వ్యాపారుల చేతుల్లోకీ క్రమేణా వెళ్లిపోయాయి. పుట 37.

[23] J. Chapman, "The Cotton and Commerce of India, Considered in Relation to the Interests of Great Britain; with

Remarks on Railway Communication in the Bombay Presidency," London, 1851, p. 91. (జె. చాప్‌మన్, "ఇండియా పత్తి, వాణిజ్యం; గ్రేట్ బ్రిటన్ ప్రయోజనాల దృష్ట్యా వీటి పరిగణన, దీనితోపాటు బొంబాయి రాజధానిలో రైల్వే రవాణా మార్గంపై అభిభాషణలు," లండన్, 1851, పుట 91.) పుట 39.

[24] G. Campbell, "Modern India: A Sketch of the System of Civil Government," London, 1852, pp. 59–60. (జి. కాంబెల్, "ఆధునిక ఇండియా: సివిల్ పరిపాలనావిధాన సంగ్రహచిత్రణ," లండన్, 1852, పుటలు 59–60.) పుట 40.

[25] 1857 లో మార్క్స్ తన నోటుబుక్కులో రాసుకున్నదానిని అనుసరించేవుంది ఈ శీర్షిక. పుట 44.

[26] ఆనాటికి అమలులోవుంటూన్న ఒడంబడికలను ఉల్లంఘించుతూ, 1856 లో బ్రిటిష్ అధికార్లు అయోధ్య రాజును కూలదోసి, అయోధ్యను ఈస్ట్ ఇండియా కంపెనీ రాజ్యంలో కలిపివేసిన వైనాన్ని రచయిత ఇక్కడ ఉదాహరిస్తున్నాడు. (చూ. ఈ సంకలనంలో పుటలు 170–177) – పుట 44.

[27] 19 వ శతాబ్ది మధ్యకాలంలో బ్రిటన్ ఆసియాలో అవలంబించిన దురాక్రమణ వలసవిధానంలో ఒక ప్రధానాంశంగా ఏర్పడిన 1856–1857 ఆంగ్ల-పర్షియా యుద్ధాన్ని గురించి రచయిత ఇక్కడ చెబుతున్నాడు. హీరట్ రాష్ట్రాన్ని పట్టుకోడానికి పర్షియా రాజులు చేసిన ప్రయత్నం ఈ యుద్ధానికి సాకుగా ఏర్పడింది. ఈ రాష్ట్రానికి ముఖ్యపట్నమైన హీరట్ వాణిజ్యవ్యాపారాలకి కూడలిస్థానమై, యుద్ధవ్యూహాలదృష్ట్యా కీలకస్థానం వహించుతూండడం కారణంగా, 19 వ శతాబ్ది మధ్యకాలంనుండి ఈ నగరం, రష్యా సహాయాన్ని పొందిన పర్షియాకూ, ఇంగ్లీష్‌వారిచే పురికొల్పబడిన ఆఫ్ఘనిస్థానానికి వివాదకారణంగా ఏర్పడింది. 1856 అక్టోబరులో పర్షియా సైనికబలాలు హీరట్‌ను పట్టుకోవడంతో, ఆఫ్ఘనిస్థానం పర్షియాలు రెండింటినీ కూడా లొంగదీసుకోడానికి దీనిని చక్కని మిషగా ఉపయోగించుకుని, బ్రిటిష్ వలసవిధానవాదులు సాయుధ జోక్యం కలిగించుకున్నారు.

పర్షియాపై యుద్ధాన్ని ప్రకటించి, బ్రిటిష్‌వారు తమ సైన్యాన్ని హీరట్‌కి పంపించారు. కాని, ఈ కాలంలోనే ప్రజ్వరిల్లిన 1857–1859 జాతీయ విముక్తి తిరుగుబాటు జరగడం వల్ల, బ్రిటిష్‌వారికి తొందర తొందరగా సంధి చేసుకోక తప్పిందికాదు. 1857 మార్చిలో, పారిస్‌లో జరిగిన సంధి ప్రకారం హీరట్‌పై అన్ని హక్కులను వదలుకున్నట్టు పర్షియా ప్రకటించింది. 1863 లో ఆఫ్ఘన్ అమీర్ రాజ్యంలో ఒక భాగంగా హీరట్ విలీనీకరణ జరిగింది. పుట 45.

[28] 1857–1859 తిరుగుబాటు — బ్రిటిష్ పరిపాలనపై ఇండియా ప్రజలు లేవదీసిన ప్రధాన జాతీయ విముక్తి తిరుగుబాటు. ఈ తిరుగుబాటు ప్రారంభయేముందు బ్రిటిష్ వలసవిధానవాదులతో అనేక సాయుధ సంఘర్షణలు జరగగా, పాశవికమైన వలస పరిపాలనా పీడన విధానాల ఫలితంగా — ఇండియాదేశపు రైతాంగాన్ని నిలువునా దోపిడీచేయడంతో, అందుకు ఏమాత్రమూ తీసిపోని అత్యధికమైన శిస్తుభారాన్ని రైతాంగంపై విధించడమూ, ఫ్యూడల్ వర్గాలలో కొన్ని తరగతుల హక్కులను భుక్తంచేసుకోవడమూ; స్వతంత్ర సంస్థానాలలో ఇంకా మిగిలిపోయినవాటిని కలిపేసుకునే విధానమూ; పన్నులను బలవంతంగా వసూలుచేయడంలో అవలంబించబడిన చిత్రహింసల విధానమూ, వలసవిధాన హింసాకాండా; అనుశ్రుతంగా వస్తూ ప్రజలచే మన్నింపబడుతూన్న సంప్రదాయాలనూ, ఆచారాలనూ వలసవిధానవాదులు నిర్లక్ష్యంచేసి కాలరాయడమూ — కారణంగా ఇండియా ప్రజలలో అన్ని తరగతులవారిలోనూ సర్వసామాన్యంగా ఆగ్రహావేశాలు రగుల్కొవడంవల్ల ఈ తిరుగుబాటు ప్రజ్వరిల్లింది. ఉత్తర ఇండియాలో ఉంచబడిన బెంగాల్ సైన్యం సిపాయి రెజిమెంట్లలో 1857 వసంతకాలంలో (తిరుగుబాటుకు సన్నాహాలు ఇంతకుముందే 1856 వేసవికాలంలో ప్రారంభమయాయి) తిరుగుబాటు తలయెత్తింది. (18 వ శతాబ్ది మధ్యనుండి దేశీయప్రజల నుండి ఆంగ్లో-ఇండియన్ సేనలో చేర్చుకోబడిన కిరాయి సైనికులను సిపాయిలంటారు. ఇండియాను జయించడానికీ, జయించిన రాష్ట్రాలలో తమ అధికారాన్ని నిలబెట్టడానికీ, ఇంగ్లీషు దండయాత్రికులు వీరిని ఉపయోగించారు.) ఈ ప్రాంతంలోవున్న కీలకస్థానాలను సిపాయిల చేతులలో వుండి, శతఘ్నిబలాలలో విశేషభాగం వారి ఖాయిదాకిందనే వుండేది. ఈ కారణంవల్ల, తిరుగుబాటుకు సైనికంగా వీరు మూలుకందంగా ఏర్పడ్డారు. హిందూ అగ్రవర్ణాలనుండీ (బ్రాహ్మణులు, రాజపుత్రులు వగైరా), మహమ్మదీయులనుండీ ఈ సిపాయి సేనలో ప్రజలు చేరడంవల్ల, ఇండియా రైతాంగంలోనూ —సాధారణ సిపాయిలలో అత్యధిక భాగం రైతాంగానికి చెందినవారే — సిపాయి ఆఫీసర్లతో దగ్గర సంబంధాలు కల్గివున్న ఉత్తర ఇండియా (ముఖ్యంగా అయోధ్య) ఫ్యూడల్ కులీనవంశస్థులలోనూ ప్రబలివున్న అసంతృప్తిన్ని

ఇది ప్రతిబింబించింది. విదేశీయ పరిపాలనను కూలదోసే లక్ష్యాన్ని కలిగిన ఈ ప్రజా వెల్లువ ఉత్తర, మధ్య ఇండియాలో విస్తృత ప్రాంతాలకు — ముఖ్యంగా ఢిల్లీ, లక్నో, కాన్పూర్, రోహిల్‌ఖండ్, మధ్య ఇండియా, బుందేల్‌ఖండ్‌లకు — వ్యాపించింది. ఈ వెల్లువకు, రైతాంగమూ పట్నాలలో చేతివృత్తులను అవలంబిచుతూన్న పేదప్రజే, ప్రధాన చలనశక్తి, కాని నాయకత్వం మాత్రం ఫ్యూడల్‌వర్గాలవారి చేతిలోనే వుంది; 1858 లో వీరి ఆస్తులను పూర్తిగా వాపసు ఇచ్చేస్తామని వలసపరిపాలనాధికారులు వీరితో వాగ్దానం చేసేసరికి, వీరిలో అందరూ ప్రజా తిరుగుబాటుకు ద్రోహంచేసి శత్రుపక్షం చేరిపోయారు. తిరుగుబాటు ఓటమికి ఇండియాయొక్క ఫ్యూడల్ అనైక్యతలవల్లనూ, ఇండియాలోవున్న జాతి వ్యత్యాసాలవల్లనూ, జనాభాలో సంఘీభావం లేకపోవడంవల్లనూ ఇండియాలో కులమత భేదాలవల్ల ఏర్పడిన ఏకైక నాయకత్వరాహిత్యమూ ఏకైక యుద్ధవ్యూహ పథక లోపమూ, ఇవే ప్రధానకారణాలు. ఈ పరిస్థితులను ఇంగ్లీషువారు పూర్తిగా ఉపయోగించుకున్నారు. ఇంతేకాకుండా, తిరుగుబాటును అణచివేయడంలో ఇండియా ఫ్యూడల్ సంస్థానాధీశులలో అత్యధికభాగంయొక్క సహాయం కూడా ఇంగ్లీష్‌వారికి లభించింది. ఇంగ్లీషువారికున్న సైనిక, సాంకేతిక శ్రేష్ఠత్వాప్రభావం మరొక ప్రధానకారణమైంది. ఈ తిరుగుబాటు ఇండియాలో కొన్ని భాగాలకు నేరుగా వ్యాపించనప్పటికీ (పంజాబ్, బెంగాల్, దక్షిణ ఇండియాలకు తిరుగుబాటు వ్యాపించకుండా ఇంగ్లీషువారు చూసుకున్నారు), మొత్తం ఇండియా అంతటిపైన దాని ప్రభావం వ్యాపించి, బ్రిటిష్‌వారికి దేశపరిపాలనా విధానంలో సంస్కరణలను ప్రవేశపెట్టక తప్పిందికాదు. ఇతర ఆసియా దేశాలలో వున్న జాతీయ విముక్తి ఉద్యమాలతో సన్నిహితసంబంధాలను కలిగి వుండిన ఇండియా తిరుగుబాటు, ఇంగ్లీష్ వలసవిధానవాదుల స్థానాలను బలహీనపరచింది. ఆఫ్ఘనిస్థాన్, పర్షియా, ఇంకా ఇతర ఆసియా దేశాలపట్ల తాము వేసుకున్న దురాక్రమణ పథకాలను వారు కొన్ని దశాబ్దాల వరకూ ఆచరణలో పెట్టకుండా ఉండేందుకు ఈ తిరుగుబాటు కారణమైంది. పుట 45.

[29]1856–1858 లో చైనాతో జరిగిన రెండవ నల్లమందు యుద్ధమని చెప్పబడే యుద్ధాన్ని గురించి రచయిత ప్రస్తావిస్తున్నాడు. 1856 అక్టోబరులో బ్రిటిష్‌వారు కాన్టన్‌లో చైనా అధికార్లతో మిథ్యాకారణాన్ని సృష్టించి కవ్వింపు చర్యనొకదానిని జరిపి, దీనిని యుద్ధానికి సాకుగా తీసుకున్నారు. నల్లమందును దొంగతనంగా ఎక్కించుకుని బ్రిటిష్ జెండాతో ప్రయాణంచేస్తూన్న “ఏరో” అనే పేరుగల చైనా నౌక సిబ్బందిని చైనా అధికార్లు అరెస్టుచేయడం ఈ యుద్ధానికి కారణమైంది. 1858 జూన్ వరకూ అప్పటప్పట చైనాలో

సంఘర్షణలు జరిగి, దురాక్రమణ పూరితమైన టియంట్సిన్ సంధితో ఈ యుద్ధం అంతమైంది. పుట 45.

30 "The Times" – ప్రఖ్యాతివడసిన ఇంగ్లీషు కన్సర్వెటివ్ దినపత్రిక. లండన్‌లో 1785 లో స్థాపించబడింది. పుట 51.

31 ద్వీపకల్ప యుద్ధం 1808–1814 లో ఐబీరియన్ ద్వీపకల్పంలోని స్పెయిన్, పోర్చుగల్ దేశాలలో బ్రిటన్ ఫ్రాన్సుల మధ్య జరిగింది. అదే సమయంలో ద్వీపకల్పం అంతటిలోనూ తమ స్వతంత్రం కోసమై స్పెయిన్, పోర్చుగల్ దేశస్థులు ఫ్రెంచి ఆక్రమణదారులతో యుద్ధంచేశారు. నెపోలియన్ వేసుకున్న రాజకీయ, సైనిక పథకాలు వమ్మైపోవడానికి స్పానిష్ ప్రజల పోరాటం చాలా సహాయపడింది; 1812 లో తన సేన రష్యాలో నాశనమవడంతో నెపోలియన్‌కి తన సైనికబలాలను స్పెయిన్‌నుండి వెనకకు మళ్లించక తప్పిందికాదు. పుట 52.

32 పార్లమెంటు ఎండాకాలం సమావేశంలో బ్రిటిష్ హౌస్ ఆఫ్ కామన్స్ సభ్యులు తమ పార్లమెంటు విధులను నెరవేర్చడం బదులు సాధరణంగా తమ సొంత పనులు చూసుకుంటూనో క్రీడావినోదాలకోసమో తమ కాలం గడపుతూంటారనే విషయాన్ని రచయిత గుర్తు చేస్తూన్నటు అగపడుతూంది. ఈ కారణంచేత వక్తలు తరుచు ఇంచుమించు ఖాళీ సభా మందిరంలో ఉపన్యసించాల్సి వస్తూంటుంది. పుట 54.

33 Montesquieu "Considérations sur les causes de la grandeur des Romains et de leur décadence" (మంటెస్క్యూ ''రోమ్ ఔన్నత్యానికీ, పతనానికీగల కారణాల పర్యాలోచనలు'') గూర్చి, (దీని మొదటి కూర్పు గ్రంథకర్త పేరులేకుండా ఆమ్‌స్టర్‌డామ్‌లో 1734 లో ప్రచురించబడింది), Gibbon "The History of the Decline and Fall of the Roman Empire" (గిబ్బన్ ''రోమను సామ్రాజ్య పతనాస్తమయ చరిత్ర'') గూర్చి (దీని మొదటి కూర్పు లండన్‌లో 1776–1788 లో ప్రచురించబడింది), రచయిత చెబుతున్నాడు. పుట 55.

34 ఇంగ్లండులో పెద్ద భూస్వామ్య, ఫైనాన్షియల్ ప్రభువర్గ పక్షమైన టోరీల గురించి రచయిత ప్రస్తావిస్తున్నాడు. 17 వ శతాబ్దిలో స్థాపితమైన టోరీ పార్టీ, అభివృద్ధిని

రోధకమైన అంతరంగిక విధానాలను ఎల్లప్పుడూ సమర్థించుతూ, బ్రిటనుయొక్క పరిపాలనా విధానంలో కాలంచెల్లిన అన్ని సనాతన సంస్థలనూ వెనుకవేసుకొచ్చింది. ప్రజాస్వామిక మార్పుల నన్నింటినీ ప్రతిఘటించింది. ఇంగ్లండులో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి కావడంతో, వెనుక తమకుండిన రాజకీయ ప్రభావాన్నీ, పార్లమెంటులో తమకుండిన గుత్తాధిపత్యాన్నీ టోరీలు కోల్పోయారు. పారిశ్రామిక బూర్జువావర్గానికి పార్లమెంటులో ప్రవేశించేందుకు మార్గాన్ని సుగమంచేసిన 1832 సంస్కరణ ఈ గుత్తాధిపత్యంపై మొదటి దెబ్బ తీసింది. భూస్వాములకు లాభకరంగా వుండినట్టి "కారన్ లాస్" [ధాన్యవ్యాపారంపై గల నియమాలు] రద్దు కాబడడంతో, పురాతన ఇంగ్లీషు భూస్వామ్య ప్రభువర్గం ఆర్థికంగా బలహీనపడి, పార్టీలో చీలిక బయల్దేరాయి. 1850 ల మధ్యసంవత్సరాలలో టోరీ పార్టీ క్షీణించడం ఆరంభించింది. ఈ పార్టీయొక్క వర్గసంఘట్టన మారిపోయి, పెట్టుబడిదారీ ప్రముఖులతో భూస్వామ్య వర్గ సమ్మేళనాన్ని ప్రతిబింబించింది. ఈవిధంగా 1850 చివరి, 1860 తొలిసంవత్సరాలలో పాత టోరీ పార్టీనుండి ఇంగ్లీషు కన్సర్వేటివ్ పార్టీ ప్రాదుర్భవించింది. పుట 56.

[35] 1773 వరకూ ఇండియాలో ఈస్ట్ ఇండియా కంపెనీకి ముగ్గురు గవర్నర్లు — కలకత్తాలో (బెంగాల్), మద్రాసు, బొంబాయిలలో — ఉంటూండేవారు. ప్రతి గవర్నరుకూ కంపెనీ సీనియర్ ఉద్యోగులతో ఏర్పడిన కౌన్సిలు ఒకటి ఉండేది. 1773 రెగ్యులేటింగ్ శాసనాన్ని అనుసరించి, కలకత్తా గవర్నర్‌కింద, ఇతనికి బెంగాల్ గవర్నర్ జనరల్ అనే బిరుదు ఇవ్వబడింది, నలుగురు సభ్యులుగల కౌన్సిల్ ఏర్పాటు చేశారు. గవర్నర్ జనరల్‌నీ, అతని కౌన్సిల్ సభ్యులన్నీ వెనకటిలాగు కంపెనీ నియమించకుండా, ఇక మీదటనుండి విధిగా బ్రిటిష్ ప్రభుత్వమే ఐదు సంవత్సరాల కాలపరిమితికి నియమించి, కంపెనీ కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ రాజుకి విజ్ఞప్తిచేసినపైనే, ఐదేళ్లకాలం పూర్తికాకముందు బర్తరఫుచేయడానికి రాజుకే అధికారం కలిగింది. అత్యధికసంఖ్యాకవర్గంయొక్క అభిప్రాయాన్ని కౌన్సిల్ విధిగా పాటించాల్సి వుండేది. అభిప్రాయాలు సమానంగా వున్నప్పుడు గవర్నర్ జనరల్ అభిప్రాయమే నెగ్గేది. బెంగాల్, బీహార్, ఒరిస్సాలయొక్క సివిల్, మిలిటరీ పరిపాలనా, యుద్ధము శాంతి విషయాలలో తనకు లోబడివున్న మద్రాసు, బొంబాయి రాజధానులపై సంపూర్ణమైన అజమాయిషీ అధికారమూ, గవర్నర్ జనరల్‌యొక్క విధులు. కొన్ని ప్రత్యేక పరిస్థితులలోనే మద్రాసు, బొంబాయి గవర్నర్లకు తమ సొంత పూచీపై వ్యవహరించగలిగే అధికారం ఉండేది. 1784 శాసనాన్ననుసరించి బెంగాల్ కౌన్సిలులో సభ్యులసంఖ్య మూడింటికి తగ్గించేయబడి, ఈ ముగ్గిరిలోనూ సర్వసేనాధిపతి ఒకడుగా ఉండాలని నియమించబడింది. 1786 అనుబంధ శాసనాన్ని అనుసరించి కొన్ని అత్యవసర పరిస్థితులలో కౌన్సిలు ప్రసక్తిలేకుండానే వ్యవ

హరించగలిగే హక్కు, సర్వసేనాధిపతి విధులను నిర్వహించే హక్కు గవర్నర్ జనరల్‌కు సంక్రమించాయి. 1833 శాసనం ప్రకారం బెంగాల్ గవర్నర్ జనరల్‌ని ఇండియా గవర్నర్ జనరల్‌గా నియమించారు; వెనకటి బెంగాల్ గవర్నర్ పదివి మాత్రం అతను నిర్వహించవలసే ఉండేది. కౌన్సిల్ సభ్యులసంఖ్య తిరిగి నాల్గుకు హెచ్చించబడి, సర్వసేనాధిపతి ఐదవ సభ్యుడుగా ఉండే అవకాశం కూడా సృష్టించబడింది. బ్రిటిష్ ఇండియా అంతటికీ శాసనాలు చేసే అధికారం గవర్నర్ జనరల్‌కీ అతని కౌన్సిలుకీ సంక్రమించింది. శాసనాలు చేయడంలో బొంబాయి మద్రాసు ప్రభుత్వాలకు ఇదివరకు ఉండిన అధికారం ఇప్పుడు పోయింది. వీరి కౌన్సిలులో సభ్యులు ఇద్దరు. 1853 శాసనాన్ననుసరించి, కార్యనిర్వాహకవర్గ విధులను కలిగిన నాల్గురు సభ్యులున్న కౌన్సిలుకు అదనంగా సహాయం చేసేందుకై గవర్నర్ జనరల్, సర్వసేనాధిపతి, లార్డ్ చీఫ్ జస్టిస్ ఆఫ్ బెంగాల్, అతని కిందవున్న ముగ్గురు జడ్జీలలో ఒకరు, వీరందరూ కలిసి ఏర్పడిన శాసనసభ ఒకటి నియమించబడింది. కౌన్సిలు సమన్వితుడైన గవర్నర్ జనరల్‌ను గూర్చి చేయబడిన ఈ శాసనం 1858 వరకు అమలులో వుంది.

ఇక్కడ పేర్కొనబడినది గవర్నర్ జనరల్ లార్డ్ డల్‌హౌసీ కిందవున్న సలహా సంఘం. పుట 57.

36 1857 లో మార్క్స తన నోటుబుక్కులో రాసుకున్నదాని ననుసరించే వుంది ఈ శీర్షిక. పుట 61.

37 ఈస్ట్ ఇండియా కంపెనీనీ, బ్రిటన్‌కి ఇండియాలో వున్న రాజ్యాలనూ మరింత చక్కగా పరిపాలించేందుకై చేయబడిన 1784 శాసనంకింద "బోర్డ్ ఆఫ్ కంట్రోల్" నియమించబడింది. ప్రీవీ కౌన్సిల్ సభ్యులలోనుండి రాజుగారిచే నియమించబడిన ఆర్గురు సభ్యులు కలిసి ఈ బోర్డ్ ఆఫ్ కంట్రోల్ ఏర్పడింది. బోర్డ్ ఆఫ్ కంట్రోల్ అధ్యక్షుడు మంత్రి మండలిలో సభ్యుడుగా ఉండి, వాస్తవంగా సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియాగానూ, ఇండియా సార్వభౌమ పరిపాలకుడుగానూ వ్యవహరించేవాడు. లండన్‌లో సమావేశమయే బోర్డ్ ఆఫ్ కంట్రోల్ చేసే తీర్మానాలన్నీ, ఈస్ట్ ఇండియా కంపెనీ డైరెక్టర్లలో ముగ్గిరితో ఏర్పాటు కాబడిన సీక్రెట్ కమిటీ [రహస్య సమితి] ద్వారా ఇండియాకు పంపబడేవి. ఈ విధంగా 1784 శాసనం ఇండియా పరిపాలనలో ఒక ద్వంద్వ ప్రభుత్వాన్ని — బోర్డ్ ఆఫ్ కంట్రోల్ (బ్రిటిష్ గవర్నమెంటు), కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ (ఈస్ట్ ఇండియా కంపెనీ) — స్థాపించింది. 1858 లో బోర్డ్ ఆఫ్ కంట్రోల్ రద్దయిపోయింది. పుట 61.

38 1854 అక్టోబరు మొదటి రోజుల్లో సెవస్తోపోల్‌ను మిత్రరాజ్యాలవారు పట్టుకున్నారని పారిస్‌లో పుకార్లు లేవదీశారు. ఫ్రాన్సు, బ్రిటన్, బెల్జియమ్, జర్మనీలలోని అధికార వార్తాపత్రికలు ఈ దొంగఖబురును ప్రచురించాయి. కాని కొద్దిరోజుల తరువాత ఈ వార్త అసత్యమని వాటికి ఒప్పుకోక తప్పిందికాదు. పుట 65.

39 "The Bombay Times" 1838 లో బొంబాయిలో స్థాపించబడిన ఇంగ్లీష్ వార్తాపత్రిక. పుట 65.

40 "The Press" – 1853 నుండి 1866 వరకూ లండన్‌లో ప్రచురించబడిన టోరీ వార్తపత్రిక. పుట 67.

41 "Le Pays" – 1849 లో పారిస్‌లో స్థాపించబడిన ఫ్రెంచి దినపత్రిక. రెండవ సామ్రాజ్య కాలంలో (1852–1870), మూడవ నెపోలియన్ ప్రభుత్వంయొక్క అనధికారపత్రికగా ఉండేది; ఈ పత్రికకు "Journal de l'Empire" అనే ఉపశీర్షిక కూడా ఉండేది. పుట 68.

42 "The Morning Post"– 1772–1937 లో లండన్‌లో ప్రచురించబడిన కన్సర్వేటివ్ దినపత్రిక. 19 వ శతాబ్ది మధ్యసంవత్సరాలలో పామర్‌స్టన్ అనుయాయులైన కుడిపక్షపు విగ్గు సభ్యుల పత్రికగా ఇది ఉంటూండేది. పుట 72.

43 సారగోస్సా – స్పెయిన్‌లో ఎబ్రొ నదీతీరాన వున్న పట్నం. ద్వీపకల్పపు యుద్ధంలో, 1808–1809 లో ఫ్రెంచి సేనలు ఈ పట్టణాన్ని ముట్టడించగా, ఈ పట్నం వీరోచితంగా ప్రతిఘటించింది. (చూ. 31 వ వ్యాఖ్య.) పుట 78.

44 డాన్యూబ్ తగాదా అంటే, 1856 పారిస్ కాంగ్రెస్‌లో జరిగిన దౌత్యవర్గపు ఘర్షణ, ఇక ఆటుతర్వాత, అప్పట్లో టర్కీ పరిపాలన కింద వున్న డాన్యూబ్ రాష్ట్రాలైన మోల్డావియా, వల్లెహియాల విలీనీకరణ సమస్యపై జరిగిన ఘర్షణ అని మార్క్స్ ఉద్దేశ్యం. వీటికి రాజులుగా బోనపార్టు వంశంవారిని నియమించడానికి వీలుంటుందనే ఆశతో, యూరప్‌ను పరిపాలించుతూన్న రాజవంశాలలోని వారినెవరినైనా రాజుగా ఏర్పరచి, అతనికింద వీటిని రుమేనియా రాజ్యంగా విలీనీకరణచేయవచ్చునని ఫ్రాన్సు సూచించింది. ఫ్రాన్సును రష్యా, ప్రష్యా, సార్డీనియాలు

బలపర్చాయి. రుమేనియా రాజ్యం ఆటోమన్ సామ్రాజ్యాధిపత్యాన్ని ధిక్కరించి ఎక్కడ స్వతంత్ర మై పోతుందోనన్న భయంతో, టర్కీ ఈ విలీనీకరణను వ్యతిరేకించింది. టర్కీని ఆస్ట్రియా, బ్రిటన్‌లు బలపర్చాయి. చివరకు స్థానిక శాసనసభ్యులైన "దివాన్"లకు ఎన్నికలు జరపడం ద్వారా రుమేనియన్ ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోడం అవసరమని మహాసభ అంగీకరించింది. ఎన్నికలు జరిగాయి; కాని కొన్ని అసత్యాలను ప్రచారంచేయడంవల్ల మోల్దావియా దివాన్‌కు ఎన్నికలలో విలీనీకరణ వ్యతిరేకులకే విజయం లభించింది. దీనిపట్ల ఫ్రాన్సు, రష్యా, ప్రష్యా సార్డీనియాలు తమ అధిక్షేపణ తెలియజేసి, ఎన్నికలను రద్దుపరచాలని కోరాయి. టర్కీ తన ప్రత్యుత్తరం ఇవ్వడంలో జాప్యంచేసింది; అందుపైన ఈ రాజ్యాలన్నీ 1857 ఆగస్టులో టర్కీతో తమ దౌత్యసంబంధాలను తెగతెంపులు చేసుకున్నాయి. మూడవ నెపోలియన్ మధ్య వర్తిత్వం వహించి, ఈ ఫ్రెంచి పథకంవల్ల, ఫ్రాన్సు బ్రిటన్లు రెంటికీ లాభంకలుగుతుందని బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఒప్పించడం మూలంగా ఈ తగాదా పరిష్కారమైంది. ఆ రాష్ట్రాల్లో జరిగిన ఎన్నికలను రద్దుచేశారే గాని, కొత్త ఎన్నికలవల్ల తగాదా పరిష్కారంకాలేదు. రెండు రాష్ట్రాలను ఐక్యంచేయడమనే సమస్యను రుమేనియా ప్రజలు తమంతట తామే 1859 లో నిశ్చయించుకోడంతో ఈ తగాదా పరిష్కారమైంది. పుట 78.

[45] జర్మన్ రాష్ట్రాలైన ష్లెస్‌విగ్, హోల్‌స్టయిన్‌లు కొన్ని శతాబ్దాలుగా డెన్మార్క్ రాజు పరిపాలనకింద ఉండేవి. డెన్మార్క్ రాచరికానికి ఎట్టి భంగమూ వాటిల్లకుండా హామీ నిస్తూ జరిగిన లండన్ సంధి పత్రంపై 1852 మే 8 ని రష్యా, ఆస్ట్రియా, బ్రిటన్, ఫ్రాన్సు, ప్రష్యా, స్వీడన్‌లూ, వీరితోసహా డెన్మార్క్ ప్రతినిధులిద్దరూ సంతకంచేశారు; ఈ రెండు రాష్ట్రాలకూ స్వయం పరిపాలన హక్కును ఈ సంధి గుర్తించింది కాని, అదే సమయంలో ఈ రెండు రాష్ట్రాలపై డెన్మార్క్ రాజుయొక్క సార్వభౌమత్వాన్ని మాత్రం పరిరక్షించింది. అయినప్పటికీ, ఈ సంధి షరతులకు విరుద్ధంగా, డెన్మార్క్ పరిపాలనకింద వున్న ఈ జర్మన్ 'డచ్చీ' లకున్న స్వాతంత్ర్యాన్నీ, స్వయం పరిపాలన హక్కునూ రద్దుచేస్తూ ఒక రాజ్యాంగప్రణాళికను డెన్మార్క్ 1855 లో ప్రకటించింది. దీనికి ప్రతీకారచర్యగా, ఈ రాష్ట్రాలలో రాజ్యాంగప్రణాళికను అమలు జరపడంపట్ల తన అధిక్షేపణ తెలియజేస్తూ జర్మనీదేశపు పార్లమెంటు 1857 ఫిబ్రవరిలో ఒక ఉత్తర్వు ప్రకటించింది; కాని పొరపాటు వల్ల ఆ ఉత్తర్వులో ఒక్క హోల్‌స్టయిన్, లౌవెన్‌బర్గ్ (డెన్మార్క్ పరిపాలనకిందవున్న మూడవ జర్మన్ రాష్ట్రం) పేర్లనే పేర్కొని, ష్లెస్‌విగ్ పేరును పేర్కొనడం మర్చి పోయింది. ఈ పొరపాటును సాకుగా తీసుకొని ష్లెస్‌విగ్‌ను తన రాజ్యంలో కలిపేసుకోవడానికి డెన్మార్క్ చర్యలను తీసుకోవడం ఆరంభించింది. దీనితో హోల్‌స్టయిన్‌తో విడిపోడానికి

ఇష్టంలేని ష్లెస్విగ్ ప్రజలేకాకుండా, ప్రష్యా, ఆస్ట్రియా, బ్రిటన్‌లు కూడా, డెన్మార్క్ యొక్క కార్యం లండన్ సంధి షరతులకు వ్యతిరేకమని, ఆధిక్షేపించాయి. పుట 79.

[46] మార్క్స్ తన 1857 లో నోటుబుక్కులో రాసుకొన్న దానిప్రకారం, "ఇండియాలో జరిగిన చిత్రహింసలపై దర్యాప్తు" అనే వ్యాసం, ఆగస్టు 28 న రాసినట్లు కనబడుతూంది; కాని మరే కారణంచేతనో, "New-York Daily Tribune" పత్రికా సంపాదకులు ఇందులో ఉదాహరించినట్టే, మార్క్స్ సెప్టెంబరు 4 వ తేదీనే రాసినట్టి "ఇండియాలో తిరుగుబాటు" అనే వ్యాసం (చూ. ఈ సంకలనం పుటలు 103–107) తరువాతనే ఈ వ్యాసాన్ని ప్రచురించారు. పుట 80.

[47] బ్లూ బుక్సు (Blue Books)–బ్రిటిష్ పార్లమెంటూ, విదేశాంగ మంత్రిత్వ కార్యాలయమూ ప్రచురించే భోగట్టా విషయాలకూ పత్రాలకూ మామూలుగా ఇచ్చే పేరు. ఈ పుస్తకాలపైన నీలిరంగు కాగితం అట్టవేసివుండడాన్ని వీటికి "నీలిరంగు పుస్తకాల"నే పేరు వచ్చింది. ఈ పుస్తకాలు 17 వ శతాబ్దినుండీ ప్రచురింపబడుతూ, ఇంగ్లండుయొక్క ఆర్థిక, రాజకీయ చరిత్రకు అధికారయుతమైన ప్రధాన మూలాధార గ్రంథాలుగా ఏర్పడుతున్నాయి. ఇక్కడ రచయిత "East India (Torture)," London, 1855–1857 ["ఈస్ట్ ఇండియా (చిత్రహింస)" లండంన్, 1855–1857] అనే "బ్లూ బుక్కు"ను ఉదాహరించుతున్నాడు. పుట 80.

[48] "Report of the Commission for the Investigation of Alleged Cases of Torture at Madras," London, 1855 ("మద్రాసులో చిత్రహింసలు జరిగినట్లు చెప్పబడిన ఉదంతాలపై దర్యాప్తు జరిపిన కమీషన్‌యొక్క నివేదిక," లండన్, 1855). పుట 80.

[49] అగ్రమాంటె – అరియోస్టో రచించిన "ఓర్లాండో ఫ్యూరియోజో" [అగ్రహపరుడైన ఓర్లాండో] అనే పద్యకావ్యంలో మూర్‌దేశపు రాజ. షార్లమేన్‌తో జరిగిన యుద్ధంలో ఇతడు పారిస్ నగరం ముట్టడించి, తన సేనలో అత్యధిక భాగాన్ని పారిస్ దుర్గం ఎదుట సమీకరించాడు. "ఓర్లాండో ఫ్యూరియోజో" కావ్యంలో వున్న "అగ్రమాంటె శిబిరంలో ముసలం పుట్టింది" అనే పంక్తిని సాధారణంగా కలహాన్ని సూచించడానికి ఉపయోగించుతారు. ప్రసిద్ధి వడసిన ఈ పంక్తినే మార్క్స్ ఇక్కడ సూచించుతున్నాడు. పుట 90.

[50] "The Daily News" – బ్రిటిష్ లిబరల్ పార్టీ వారా పత్రిక; పారిశ్రామిక బూర్జువావర్గ ప్రయోజనాలను ప్రతిబింబించుతూండేది; ఈ పేరుతో 1846 నుండి 1930 వరకూ లండన్ నుండి వెలువడింది. పుట 90.

[51] "The Mofussilite" – ఇండియాలో మొదట మీరట్ నుండీ, తర్వాత, ఆగ్రా అంబాలా నుండీ ఇంగ్లీషు భాషలో ప్రచురించబడి వెలువడిన వార్తాపత్రిక. పుట 94.

[52] ఈస్ట్ ఇండియా కంపెనీకి ఇచ్చిన 1853 అనుజ్ఞాపత్రం గురించి రచయిత ఇక్కడ ప్రస్తావిస్తున్నాడు (చూ. 3 వ వ్యాఖ్య). పుట 98.

[53] వెండీలో (పశ్చిమ ఫ్రాన్సులో ఇదొక రాష్ట్రం), 1793 లో విప్లవ ప్రతిఘాతక తిరుగుబాటు కావించేటట్టుగా అక్కడ నివసించుతూన్నట్టి వెనుకబడిన రైతాంగాన్ని ఫ్రెంచి రాజు పక్షంవారు ఉపయోగించుకున్నారు. ఈ తిరుగుబాటును రిపబ్లికన్ సైన్యం అణచి వేసింది. ఈ సైన్యంలో వున్న సైనికులను "నీలిరంగు చొక్కాలు" ("బ్లూస్") అనేవారు.

స్పానిష్ గెరిల్లాలు – 1808–1814 లో ఫ్రెంచి దురాక్రమణదార్లపై స్పెయిన్ దేశస్థులు సాగించిన జాతీయవిముక్తి పోరాటంలో గెరిల్లా యుద్ధంలో పాల్గొన్నవారు. విజేతలను మొండిగా ప్రతిఘటించిన రైతాంగము గెరిల్లాలవెనుక చలనశక్తిగా పనిచేసింది.

1848–1849 లో జరిగిన ఆస్ట్రియా, హంగేరీ విప్లవోద్యమాన్ని అణచివేయడానికై సాగించిన కార్యంలో రయాచిచ్, యెలాచిచ్ సేనాధిపతుల కింద సెర్బియన్, క్రోఅట్ సైనిక దళాలు పాల్గొన్నాయి. ఆస్ట్రియా-హంగేరీలో ఒక భాగమైన హంగేరీలో వున్న ప్రభువర్గం, హంగేరీ రైతాంగాన్నే పీడించడమేకాకుండా హంగేరీజాతికి చెందని అనేక ఇతర జాతులవారిని కూడా పీడించుతూండేది. సెర్బుల, క్రోఅట్ల జాతీయ స్వాతంత్ర్య కోర్కెను వీరు ప్రతిఘటించారు. దీనిని అదనుగా తీసుకుని, ఆస్ట్రియా దేశపు అభివృద్ధి నిరోధకులు తమ స్వప్రయోజనాలను పరిరక్షించుకొనేందుకై, బుడాపెస్ట్, వియన్నాలలోని తిరుగుబాటును అణచివేయడానికి సెర్బియన్, క్రోఅట్ సైనికులను ఉపయోగించారు.

గార్డ్ మొబిల్ అనే రక్షకదళం 1848 ఫిబ్రవరి 25 న ఫ్రెంచి ప్రభుత్వం ఉత్తరవు ననుసరించి, విప్లవ ప్రజా రాసులను అణచివేయడానికై స్థాపించబడింది. ఈ దళంలో ప్రధానంగా వర్గచైతన్యాన్ని పూర్తిగా కోల్పోయినట్టి మనుషులే చేరారు. ఈ దళంలోని జట్లను 1848 జూన్‌లో పారిస్ కార్మికుల విప్లవాన్ని అణచివేయడానికి ఉపయోగించారు.

యుద్ధమంత్రిగా వున్న జనరల్ కవైన్యాక్, కార్మికుల ఊచకోతకు తానే స్వయంగా ఆజ్ఞ ఇచ్చాడు.

డిసెంబ్రిస్ట్లు – 1849 లో స్థాపించబడిన బోనపార్ట్ పక్షంవారి రహస్య సంఘం. దీనిలో ప్రధానంగా వర్గచైతన్యాన్ని కోల్పోయిన వ్యక్తులు, రాజకీయ సాహసికులు, సైనికతత్వవాదులు వగైరాలు చేరారు. 1848 డిసెంబరు 10 న జరిగిన ఎన్నికలలో (ఇందు వల్లనే వీరికీ పేరు వచ్చింది) ఫ్రెంచి రిపబ్లిక్ అధ్యక్షుడుగా లూయీ బోనపార్ట్ ఎన్నిక అవడానికి వీరు చాలా సహాయపడ్డారు. 1851 డిసెంబరు 2 న రాజ్యాంగంపై తీసిన దెబ్బలో వీరు పాల్గొన్నారు. దీని ఫలితంగా 1852 లో లూయీ నెపోలియన్, మూడవ నెపోలియన్ అనే పేరుతో ఫ్రెంచి చక్రవర్తిగా ప్రకటించబడ్డాడు. రిపబ్లికన్లను అణచివేయడంలో, అందులో ముఖ్యంగా 1848 విప్లవంలో పాల్గొన్న రిపబ్లికన్లను మూకుమ్మడిగా అణచి వేయడానికీ వీరు ముఖ్యకారకులు. పుట 103.

[54] మొదటి నల్లమందు యుద్ధం (1839–1842) గురించి రచయిత చెబుతున్నాడు. చైనాను అర్ధవలసరాజ్య ప్రతిపత్తికిందకు దిగజార్చేయడానికై ప్రారంభించిన కార్యంలో బ్రిటిష్‌వారు సాగించిన ఈ దురాక్రమణ యుద్ధం మొదటి మెట్టు. కాన్‌టన్ పట్నంలో విదేశవర్తకులకు చెందిన నల్లమందు నిల్వలను చైనా అధికార్లు నాశనంచేసిన కార్యాన్ని సాకుగా తీసుకుని ఈ యుద్ధం ప్రారంభమైంది. వెనకబడి వున్న ఫ్యూడల్ చైనా ఈ యుద్ధంలో పొందిన ఓటమిని అదనుగా ఉపయోగించుకుని, బ్రిటిష్ వలసవిధానవాదులు చైనా నెత్తిపై దురాశాపూరితమైన నాన్‌కింగ్ సంధిని (1842 ఆగస్టు 29) రుద్దారు. దీని ననుసరించి, చైనాలో ఐదు రేవు పట్నాలు (కాన్‌టన్, ఆమోయ్, ఫూచౌ, నింగ్‌పో, షాంగ్‌హై) బ్రిటిష్ వర్తకానికి తెరవబడి, హంకాంగ్ ద్వీపం బ్రిటిష్‌వారికి "శాశ్వత అధీనం"గా వశంచేయబడి, యుద్ధఖర్చులకై బ్రహ్మాండమైన మొత్తాన్ని చైనాపై పరిహారంగా విధించారు. 1843 జరిగిన అనుబంధ ఒడంబడిక ప్రకారం విదేశీయులకు తన భూభాగంపై రాజ్యేతర విస్తృత స్వామ్యాధికారాలను చైనా ఇవ్వవలసి వచ్చింది. పుట 104.

[55] కాన్‌టన్ నగరంపై బ్రిటిష్‌వారు చేసిన అమానుషమైన ఫిరంగిదాడిని గురించి రచయిత చెబుతున్నాడు. చైనాలో బ్రిటిష్ సూపరింటెండెంటుగావున్న జాన్ బౌరింగ్ ఉత్తరవుపై జరిగిన ఈ దాడిలో పట్నం శివార్లలోని సుమారు 5,000 ఇళ్లు నాశనమైపోయాయి. రెండవ నల్లమందు యుద్ధానికి (1856–1858) ఇది నాందీవాక్యం. (చూ. 29 వ వ్యాఖ్య.)

శాంతి సంఘం – 1816 లో లండన్‌లో క్వేకర్లు స్థాపించిన బూర్జువా యుద్ధ వ్యతిరేక సంస్థ. శాంతి పరిస్థితులు ఏర్పడినట్టయితే, స్వేచ్ఛావ్యాపార విధానం ద్వారా తన పారిశ్రామిక శ్రేష్ఠతను బ్రిటన్ మరింత చక్కగా ఉపయోగించుకుని, ఈవిధంగా ఆర్థిక, రాజకీయ ప్రాబల్యాన్ని సాధించుకోగల్గుతుందని తలచినట్టి స్వేచ్ఛావ్యాపారవాదుల శక్తివంత మైన వత్తాసు ఈ సంఘానికి లభించింది.

1845 లో ఆల్జీరియాలో జరిగిన ఉపప్లవం అణచివేతలో – కొండ గుహల్లో దాగుకున్న ఒక వెయ్యిమంది అరబ్బు తిరుగుబాటుదార్లను పొగపెట్టి ఉక్కిరిబిక్కిరి చేసేయ వలసిందని జనరల్ పెలిస్సియే – ఇతడు తదుపరి ఫ్రాన్సుదేశపు మార్షల్ అయాడు – ఆజ్ఞ జారీచేశాడు. పుట 106.

[56] గయస్ జూలియస్ సీజర్ రచించిన "Commentarii de bello Gallico" ("గాల్లియా దేశంపై జరిగిన యుద్ధంపై వ్యాఖ్యానం") గ్రంథం గురించి రచయిత చెబు తున్నాడు. ఇక్కడ పేర్కొన్న విషయం, గాల్లిక్ యుద్ధంపై సీజర్ వివరణలను పూర్తిచేసి నట్టి సీజర్ స్నేహితుడూ, ఒకప్పుడు అతని ప్రతినిధీ అయిన ఎ. హిర్షియస్ రాసిన పుస్త కంలో 8 వ అధ్యాయంలో చెప్పబడింది. పుట 106.

[57] 1532 లో రేగెన్స్‌బుర్గ్‌లో జరిగిన రైళ్స్‌టాగ్‌లో అంగీకరించబడినట్టి ఐదవ చార్లెస్ రచించిన క్రిమినల్ శాసనం ("Constitutio criminalis Carolina")గురించి మార్క్స్ చెబుతున్నాడు. ఈ శాసనం అత్యంత కఠిన శిక్షలను విధించడానికి పేరుపొందింది. పుట 106.

[58] W. Blackstone, "Commentaries on the Laws of England." Vols. I-IV. First Edition, London, 1765–1769 (డబ్లియు. బ్లాక్‌స్టన్, "ఇంగ్లండు దేశంయొక్క శాసనాలపై వ్యాఖ్యానాలు," సంపుటములు I-IV. మొదటి కూర్పు, లండన్, 1765–1769.) పుట 106.

[59] మోజార్ట్ రచించిన సంగీతనాటకం "Die Entführung aus dem Serail" ("అతఃపురంనుండి అపహరణ") 3 వ అంకం 6 వ రంగం, ఆస్మిన్ కూర్చిన గీతం. పుట 107.

[60] బైబిల్‌లో చెప్పిన కథనాన్ననుసరించి, ఇజ్రాయెల్ దేశస్థులు తమ బాకాలతో ఒక్కసారే వూదేసరికి ఆ గాలి జోరుకి జెరికో గోడలు కూలబడిపోయాయట. పుట 107.

[61] 1848 విప్లవం ఓటమిచెందిన తరువాత, హంగేరీనుండి వలసపోయిన హంగేరియన్ రచయిత, పత్రికారచయిత అయినట్టి తమ సిబ్బంది విలేకరి ఫెరెన్స్ పుల్స్కీని గురించిని ఈ వాక్యం "New-York Daily Tribune" సంపాదకులు ఇక్కడ దూర్చారు. పుల్స్కీ ప్రధానంగా అంతర్జాతీయ విషయాలను సమీక్షచేస్తూ రాసేవాడు. పుట 108.

[62] 1784 నుండి బెంగాల్ నుండి వెలువడిన ఇంగ్లీష్ పత్రిక "The Calcutta Gazette" గురించి మార్క్స్ చెబుతూన్నట్టు కనబడుతుంది. ఇది ఇండియాలోని బ్రిటిష్ ప్రభుత్వపు అధికారయుత పత్రిక. పుట 110.

[63] 1838–1842 మొదటి ఆంగ్ల-ఆఫ్ఘన్ యుద్ధాన్ని గురించి రచయిత చెబుతున్నాడు. ఆఫ్ఘనిస్థానాన్ని లొంగదీసుకొనే ఉద్దేశ్యంతో బ్రిటిష్‌వారు ఈ యుద్ధం ప్రారంభించారు. 1839 ఆగస్టులో బ్రిటిష్‌వారు కాబూల్‌ను వశపర్చుకున్నప్పటికీ, 1841 నవంబరులో ప్రజ్వరిల్లిన తిరుగుబాటువల్ల, 1842 జనవరిలో వారు ఆ నగరంనుండి వైదొలగాల్సి వచ్చింది. వారు ఇండియా దిశగా మళ్లినప్పుడు, ఆ తిరోగమనం భయాందోళనలతో కూడిన పలాయనంగా పరిణమించింది. ఇంగ్లీషు సైనికులు 4,500 మందిలోనూ, శిబిర పరివారం 12,000 మందిలోనూ ఒకే ఒక్కడు ప్రాణాలతో బైటపడి ఇండియా సరిహద్దు చేరుకోగల్గాడు. పుట 113.

[64] నెపోలియన్ పరిపాలన కింద వున్న ఫ్రాన్సుపై జరిగిన యుద్ధంలో 1809 లో షెల్డె నదీ ముఖానికి పంపబడిన బ్రిటిష్ నౌకా దండయాత్ర గురించి రచయిత చెబుతున్నాడు. వాల్‌ఖెరెన్ ద్వీపాన్ని బ్రిటిష్‌వారు ఆక్రమించుకున్న తర్వాత, తమ చర్యను పూర్తిగా కొనసాగించకోవడం ఫలితంగా, బ్రిటిష్‌వారికి ఆ ద్వీపాన్ని ఆక్రమించున్నప్పుడు ఉండిన 40,000 మంది సైనికులలోనూ, ఆకలి వల్లా రోగాలవల్లా సుమారు 10,000 మందిని కోల్పోయిన తర్వాత వారు వైదొలగాల్సి వచ్చింది. పుట 114.

[65] "New-York Daily Tribune"లో ప్రచురించబడిన వ్యాసం, "7 వ తేదీ వరకూ వెలువడిన లండన్ పత్రికల కట్టలు మాకు నిన్ననే అందాయి" అనే వాక్యంతో ఆరంభమౌతూంది; ఈ వాక్యాన్ని పత్రికా సంపాదకులు వ్యాసవాచకంలో చొప్పించారు. పుట 119.

[66] "The Morning Advertiser"–1794 లో లండన్‌లో స్థాపించబడిన ఇంగ్లీష్ దినపత్రిక; 1850 లలో అది రాడికల్ బూర్జువావర్గపు పత్రికగా ఉండేది. పుట 124.

[67] "The Friend of India"–1818 లో సెరాంపూర్ స్థాపించబడిన ఇంగ్లీష్ వార్తా పత్రిక; 1850 లలో అది వారపత్రికగా వుంటూ, బూర్జువా లిబరల్ ధోరణి కలిగి వుండేది. పుట 126.

[68] "The Military Spectator"–1857 నుండి 1858 వరకు లండన్ నుండి వెలువడిన బ్రిటిష్ వార్తాపత్రిక; ఇది వారపత్రికగా ప్రచురింపబడేది. పుట 126.

[69] "The Bombay Courier"–బ్రిటిష్ ప్రభుత్వ వార్తాపత్రిక; ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారయుత పత్రిక. 1790 లో స్థాపితం. పుట 128.

[70] మార్క్సుచే సంగ్రహించబడినట్టి ఈ పట్టిక, తన వ్యాసంతో పాటు న్యూయార్క్ పంపబడినప్పటికీ, పత్రికాసంపాదకులు అదే సంచికలో 6 వ పుటలో వేరుగా ప్రచురించారు. పుట 130.

[71] రచయిత క్రైమియా యుద్ధాన్ని గురించి చెబుతున్నాడు. సెవస్తోపాల్‌పై దాడి చేయడానికి బ్రిటిష్, ఫ్రెంచి, టర్కీ సైన్యాలు సిద్ధపడుతూండగా, ఆ దాడి జరగకుండా చేయడానికై వీటిపై రష్యన్ సైన్యాలు ఇంకెర్‌మన్ వద్ద 1854 నవంబరు 5 న ఎదురుదాడి సాగించాయి. రష్యన్ సైనికబలాలు ధైర్యసాహసాలతో పోరాడినప్పటికీ, బ్రిటిష్, ఫ్రెంచి, టర్కీ సైనికబలాలకే ఆ యుద్ధంలో విజయం లభించింది. పుట 133.

[72] 1854 అక్టోబరు 25 న రష్యన్ సైనికబలాలకీ మిత్రరాజ్యాల సైనికబలాలకీ బాలక్లావాలో జరిగిన యుద్ధంలో, మిత్రరాజ్యాలు మంచి ఉపయోగకరములైన స్థానాలనే ఆక్రమించుకొని ఉండినప్పటికీ, బ్రిటిష్, ఫ్రెంచి సైన్యాలకి విపరీతమైన నష్టాలు సంభవించాయి. ఇంగ్లీష్ సేనాధిపత్యం కావించిన పొరపాట్ల ఫలితంగా ఒక ఇంగ్లీష్ లైట్ కేవెల్‌రీ బ్రిగేడ్ నష్టమైపోయింది. పుట 134.

[73] "The Bombay Gazette" – 1791 లో ఇండియాలో స్థాపించబడిన ఇంగ్లీష్ వార్తాపత్రిక. పుట 136.

[74] "Globe" – 1803 నుండి లండన్‌నుండి వెలువడిన ఇంగ్లీషు దినపత్రిక "The Globe and Traveller"యొక్క సంగ్రహనామం. విగ్‌పక్షపు పత్రిక; విగ్‌పక్షంవారు

ప్రభుత్వానికి వచ్చినప్పుడల్లా ఇది ప్రభుత్వ పత్రికగా ఉండేది. 1866 నుండి కన్సర్వేటివ్‌ల పత్రికగా ఉంది. పుట 142.

[75] ఈస్ట్ ఇండియా కంపెనీకి చైనా వర్తకంలో వుండిన గుత్తవ్యాపారాన్నీ, కంపెనీ యొక్క వాణిజ్యసంస్థ హోదానూ రద్దుచేసినట్టి 1833 పార్లమెంటు శాసనాన్ని గురించి రచయిత చెబుతున్నాడు. కంపెనీకున్న పరిపాలనా విధులను మాత్రమే ఈ శాసనం నిలబెట్టి, కంపెనీ అనుజ్ఞాపత్రాన్ని 1853 వరకూ పొడిగించింది. పుట 142.

[76] "The Phoenix" – ఇండియాలో ఇంగ్లీషుప్రభుత్వ పత్రిక; 1856 నుండి 1861 వరకు కలకత్తానుండి ప్రచురించబడింది. పుట 144.

[77] మార్క్సుయొక్క 1858 నోటుబుక్కులో వున్న ఒక పద్దును అనుసరించి ఈ వ్యాసానికి ఈ శీర్షిక ఇవ్వబడింది. పుట 146.

[78] 1853–1856 క్రైమియా యుద్ధాన్ని గురించి చెబుతున్నాడు రచయిత. 1854 సెప్టెంబరు 20 న ఆల్మావద్ద యుద్ధం జరిగింది; దీనిలో మిత్రరాజ్య సేనకి విజయం లభించింది. పుట 146.

[79] 1853–1856 క్రైమియా యుద్ధానికి ఇది అన్వయిస్తుంది. 1855 జూన్ 18 న సెవస్తోపోల్ దుర్గం మూడవ బురుజాపై (ఈ బురుజానే "పెద్ద రెడాన్" అని పిలచేవారు) మిత్రరాజ్య సేనలు నిష్ఫలితమైన దాడిచేసిన సమయంలో, ఆ బ్రిగేడ్ విండ్ హామ్ నాయకత్వంకిందనే వుంది. పుట 147.

[80] 1858 లో మార్క్సు తన నోటుబుక్కులో రాసుకున్న దానితో సరిపోతూంది ఈ శీర్షిక. పుట 154.

[81] 1838–1843 మొదటి ఆంగ్ల-ఆఫ్ఘన్ యుద్ధానికి ఇది అన్వయిస్తుంది. (చూ. 63 వ వ్యాఖ్యలు). పుట 155.

[82] బర్మాలో నగరాల చుట్టూ, శిబిరాల చుట్టూ పూర్వకాలపు దుర్గరక్షణ ననుసరించి నిర్మించే కోటగోడల నమూనాలను గురించి ఎంగెల్స్ చెబుతున్నాడు. పుట 165.

[83] స్పానిష్ దుర్గమైన బాడాహోస్ ఫ్రెంచివారి అధీనంలో వుంది. దీనిని 1812 ఏప్రిల్ 6 న వెల్లింగ్‌టన్ కింద వున్న బ్రిటిష్ సైన్యం పట్టుకుంది.

ఫ్రెంచివారు వశపర్చుకున్న సాన్ సబాస్టియన్ దుర్గంపై 1813 ఆగస్టు 31 న దాడి జరిగింది. పుట 167.

[84] ఇండియా గవర్నర్ జనరల్ అయిన లార్డ్ కానింగ్ 1858 మార్చి 3 న చేసిన ప్రకటనకు ఇది అన్వయిస్తూంది. ఈ ప్రకటన ప్రకారం, తిరుగుబాటులో చేరిన బడా ఫ్యూడల్ భూస్వాములైన తాలుక్దార్ల భూములతోసహా అయోధ్య రాజ్యానికి చెందిన ప్రాంతాలన్నీ బ్రిటిష్ అధికారులచే జప్తుచేయబడ్డాయి. అయినప్పటికీ, తాలుక్దార్లను తన పక్షం తిప్పుకోడానికి ప్రయత్నించిన బ్రిటిష్ ప్రభుత్వం, కానింగ్ ప్రకటనయొక్క అర్థాన్ని మార్చింది. తాలుక్దార్లయొక్క ఆస్తులకు ఎట్టి భంగమూ కలగదని వారికి వాగ్దానం చేసిన తర్వాత, వారు తిరుగుబాటుయెడల ద్రోహంగావించి, బ్రిటిష్‌వారి పక్షం చేరిపోయారు.

''అయోధ్యను కలిపివేసుకోవడం,'' ''లార్డ్ కానింగ్ ప్రకటన, ఇండియాలో భూమి అనుభవము'' అనే వ్యాసాలలో మార్క్స్ లార్డ్ కానింగ్ చేసిన ప్రకటనను విమర్శనాత్మకంగా విశ్లేషించాడు. (చూ. ఈ సంకలనంలో పుటలు: 170–177; 178–182). పుట 168.

[85] బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా గొప్ప ధైర్య స్థైర్యాలతోనూ, మంచి ఆర్గనైజేషనుతోనూ సిక్కు సైన్యం పోరాడినప్పటికీ, 1845 డిసెంబరు 18 న ముడ్కీగ్రామం (ఫెరోజ్‌పూరు సమీపంలో) వద్దనూ, 1845 డిసెంబరు 21 న ఫెరోజిషా వద్దనూ, 1846 జనవరి 28 న లూధియానా సమీపంలో వున్న అలివాల్ గ్రామంవద్దనూ జరిగిన యుద్ధాల్లో సిక్కులు ఓడిపోయారు. ఈ ఓటమి ఫలితంగా, 1845–1846 మొదటి ఆంగ్ల-సిక్కు యుద్ధంలో సిక్కులకు అపజయం లభించింది. తమ సర్వసేనా నాయకత్వంయొక్క ద్రోహమే సిక్కుల ఓటమికి ప్రధానకారణం. పుట 169.

[86] మార్క్స్‌యొక్క 1858 నోటుబుక్కులో వున్న ఒక పద్దును అనుసరించి ఈ వ్యాసానికి ఈ శీర్షిక ఇవ్వబడింది. పుట 170.

[87] 1858 మే 8 "Times" సంచికలో ప్రచురింపబడినట్టి, అయోధ్య విషయమై గవర్నర్ జనరల్ లార్డ్ కానింగ్ చేసిన ప్రకటనను (చూ. 84 వ వ్యాఖ్య) మార్క్స్ ఉల్లేఖిస్తున్నాడు. పుట 170.

[88] రష్యా సామ్రాజ్యంలో భాగమైన పోలెండ్ రాజ్యంలో జరిగిన 1830–1831 తిరుగుబాటును రష్యన్ అభివృద్ధినిరోధకులచే అణచివేతకు ఇది వర్తించుతూంది. పుట 170.

[89] 1848–1849 లో ఆస్ట్రియా ఇటలీల మధ్య జరిగిన యుద్ధం గురించి రచయిత చెబుతున్నాడు; ఈ యుద్ధంలో, 1849 మార్చి 23 న జరిగిన నొవారా (ఉత్తర ఇటలీ) యుద్ధంలో సార్డీనియా రాజు, చార్లెస్ ఆల్బర్ట్‌యొక్క సేన తీవ్రనష్టాలతో ఓడిపోయింది. పుట 170.

[90] అయోధ్య మొగల్ సామ్రాజ్యంలో భాగంగానే ఉండేది; కాని 18 వ శతాబ్ది మధ్యలో అయోధ్యను పాలించుతూన్న మొగల్ రాజప్రతినిధి వాస్తవానికి స్వతంత్ర రాజుగానే ఉండేవాడు. 1765 లో ఇంగ్లీషువారు అయోధ్యను సైనికసహకార సంధికింద బ్రిటిష్ సామంత రాజ్యంగా చేసేశారు. రాజకీయ ప్రభుత్వమంతా యథార్థంగా బ్రిటిష్ రెసిడెంటు చేతిలోకే వెళ్లిపోయింది. ఈ యథార్థ పరిస్థితులను మసిపూసి మారేడుకాయ చేయడానికని అయోధ్య రాజును అయోధ్య సార్వభౌముడని అంటూండేవారు. పుట 171.

[91] 1801 లో ఈస్ట్ ఇండియా కంపెనీకీ అయోధ్య నవాబుకీ జరిగిన సంధి షరతుల ననుసరించి, అయోధ్య నవాబు అప్పులు తీర్చలేదనే నెపంమీద గవర్నర్ జనరల్ వెలస్లీ నవాబు రాజ్యంలో సంగోరు భాగాన్ని కంపెనీ రాజ్యంలో కలిపేసుకున్నాడు. గోరఖ్‌పూర్, రోహిల్ ఖండ్, గంగాయమునల మధ్యనున్న ప్రదేశంలో కొంత భాగమూ ఇలాగు కలిపేసుకున్న సంగోరు భాగంలో ఉన్నాయి. పుట 172.

[92] ఈ వాక్యాన్ని "New-York Daily Tribune" పత్రికాసంపాదకులు మార్క్స్ వ్యాసంలో చొప్పించారు; అయోధ్య విషయమై లార్డ్ కానింగ్ చేసిన ప్రకటన (చూ. 84 వ వ్యాఖ్య) సందర్భంలో, గవర్నర్ జనరల్ లార్డ్ కానింగ్‌కీ, అయోధ్య చీఫ్ కమీషనరు ఔట్రామ్‌కీ జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలకు ఈ వాక్యం వర్తించుతూంది; ఈ ఉత్తర ప్రత్యుత్తరాలను 1858 జూన్ 5 వ తేదీ సంచికలో పత్రిక ప్రచురించింది. పుట 178.

[93] 19 వ శతాబ్ది మధ్యకాలానికి ఇంచుమించుగా ఇండియా అంతా కూడా బ్రిటిష్ పరిపాలన కిందకి వచ్చేసింది. కాష్మీర్, రాజపుత్రస్థానం, హైదరాబాద్‌లో కొంత భాగం, మైసూర్, ఇంకా మరికొన్ని చిన్న రాజ్యాలూ ఈస్ట్ ఇండియా కంపెనీకింద సామంతరాజ్యాలుగా ఉండేవి. పుట 178.

[94] ఇండియా గవర్నర్ జనరల్ లార్డ్ కారన్‌వాలిస్ మంజూరు చేసిన 1793 శాశ్వత జమీందారీ శాసనానికి ఇది వరిస్తూంది. (చూ. 22 వ వ్యాఖ్య.). పుట 179.

[95] అయోధ్య విషయమై లార్డ్ కానింగ్ చేసిన ప్రకటనను (84 వ వ్యాఖ్య చూ.) విమర్శించుతూ, 1858 ఏప్రిల్ 19 న బోర్డ్ ఆఫ్ కంట్రోల్ అధ్యక్షుడు, లార్డ్ ఎల్లెన్ బరో తన నివేదికలేఖలో ఈ ప్రకటనను పేర్కొన్నాడు. బ్రిటిష్ రాజకీయ వర్గాలలో లార్డ్ ఎల్లెన్‌బరో నివేదికలేఖపట్ల అసమ్మతి వెల్లవడం కారణంగా, లార్డ్ ఎల్లెన్‌బరో తన పదవికి రాజీనామా ఇవ్వాల్సి వచ్చింది. పుట 181.

[96] పార్లమెంటులో డార్బీ మంత్రివర్గం ప్రవేశపెట్టినట్టి, 1858 జూలై పార్ల మెంటుచే అంగీకరించబడినట్టి చట్టాన్ని గురించి ఇది చెబుతూంది. ''ఇండియాను మరింత చక్కగా పరిపాలించడానికై చేసిన శాసనం'' అనే పేరుతో ఈ చట్టం శాసనమైంది. ఈ శాసనంకింద ఇండియా పూర్తిగా బ్రిటిష్ రాజమకుటం కిందకి వచ్చేసింది; పోతే, ఈస్ట్ ఇండియా కంపెనీ వాటాదార్లకు 30 లక్షల పౌన్ల పరిహారం చెల్లించి కంపెనీని రద్దుపరచడం జరిగింది. బోర్డ్ ఆఫ్ కంట్రోల్‌ను ఎత్తివేసి, దాని అధ్యక్షుని స్థానే సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియాను, అతని సలహాసంఘం — ఇండియా కౌన్సిల్‌నూ నియమించడమైంది. ఇండియా గవర్నర్ జనరల్‌ని వైస్‌రాయి అన్నారు; ఆచరణలో లండన్‌లో వున్న సెక్రటరీ ఫర్ ఇండియా యొక్క అభీష్టాన్ని అమలుపరచేటట్టి కార్యాచరణోద్యోగిగా వైస్‌రాయి పనిచేస్తూంటాడు.
''ఇండియా చట్టం'' అనే వ్యాసంలో ఈ శాసనాన్ని మార్క్స్ విమర్శాత్మకంగా విశ్లేషిస్తున్నాడు. (చూ. ఈ సంకలనంలో పుటలు 206–210.). పుట 194.

[97] మార్క్స్‌యొక్క 1858 నోటుబుక్కులో వున్న ఒక పద్దును అనుసరించి ఈ వ్యాసానికి ఈ శీర్షిక ఇవ్వబడింది. పుట 200.

[98] ఆల్జీరియాను జయించడానికై 19 వ శతాబ్ది 30–70 సంవత్సరాలలో ఆ దేశంలో ఫ్రెంచి వలసవిధానవాదులు జరిపినట్టి వలసరాజ్య విస్తరణ యుద్ధాలకు ఇది అన్వయిస్తూంది. ఫ్రెంచివారు కావించిన ఆల్జీరియా దండయాత్రను అరబ్బులు సుదీర్ఘకాలం అతి పట్టుదలతో ప్రతిఘటించారు. ఫ్రెంచివారు అత్యంత క్రూరవిధానాలను అవలంబించి ఈ యుద్ధం సాగించారు. 1847 లో ఆల్జీరియా ఆక్రమణ మొత్తంమీద పూర్తి అయినప్పటికీ, తమ స్వాతంత్ర్యానికై ఆల్జీరియా ప్రజలు సలిపే పోరాటం యథార్థంగా సమాప్తిచెందనే లేదు. పుట 204.

[99] మార్క్స్ యొక్క 1858 నోటుబుక్కులో వున్న ఒక పద్దును అనుసరించి ఈ వ్యాసానికి ఈ శీర్షిక ఇవ్వబడింది. పుట 206.

[100] 1773 రెగ్యులేటింగ్ శాసనాన్ని గూర్చి రచయిత చెబుతున్నాడు. కంపెనీ వ్యవహారాల్లో పాల్గొనడానికి అర్హతగలిగినట్టీ, కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్‌ను ఎన్నుకోడానికి అర్హత గలిగినట్టీ వాటాదార్ల సంఖ్యను ఈ శాసనం తగ్గించేసింది. ఈ శాసనంకింద, 1,000 పౌన్లకు తక్కువగాని వాటులు గల వాటాదార్లకు మాత్రమే వాటాదార్ల సమావేశాల్లో వోటు చేసే హక్కు వుంది. మొట్టమొదటి సారిగా ఇండియా గవర్నర్ జనరల్, అతని కౌన్సిల్ సభ్యులూ ఒక్కొక్కరే వ్యష్టిగా ఐదు సంవత్సరాల కాలపరిమితికి నియమించబడ్డారు; కంపెనీ కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ రాజుకి అభ్యర్థనచేసిన యెడలనే రాజుకి ఉచితమని తోచినయెడలనే వారిని బర్తరఫుచేయడానికి రాజుకే అధికారముంది. మొదటి సారి నియామకములు జరిగిన తరువాత గవర్నర్ జనరల్‌నీ, అతని కౌన్సిల్ సభ్యులనీ కంపెనీ నియమించడానికి అవకాశం కల్పించ బడింది. 1773 శాసనం కింద లార్డ్ చీఫ్ జస్టిస్, మరి ముగ్గురు జడ్జీలతో కూడిన సుప్రీమ్ కోర్ట్ కలకత్తాలో స్థాపించబడింది. పుట 207.

[101] ఫ్రెంచి ప్రభుత్వం ఒత్తిడిపైన విదేశీయులపై చట్టం (లేక కుట్ర చట్టం) అనుపేరిట ఒక చట్టాన్ని హౌస్ ఆఫ్ కామన్స్‌లో 1858 ఫిబ్రవరి 8 న లార్డ్ పామర్‌స్టన్ ప్రవేశపెట్టాడు (ఈ చట్టాన్ని ప్రవేశపెట్టే ఉద్దేశ్యాన్ని పామర్‌స్టన్ ఫిబ్రవరి 5 న తెలియపర్చాడు). ఈ చట్టాన్ననుసరించి, యునైటెడ్ కింగ్‌డమ్‌లో నివసిస్తూన్న వ్యక్తిపైన, బ్రిటిష్ పౌరుడైనా సరే, విదేశస్థుడైనా సరే, బ్రిటన్‌లోకాని మరే ఇతర దేశంలోకాని ఎవరి నైనా హత్యచేయడానికై కుట్రలో పాల్గొన్నట్టుగా గాని, అట్టి కుట్రను పన్నినట్టుగాని నేరం మోపబడినయెడల, అట్టి వ్యక్తిని కోర్టు ఎదుట విచారణకు పెట్టి, కోర్టు దోషిగా నిర్ణయించిన పక్షమందు కోర్టు అతనిపై కఠినమైన శిక్షను విధించవచ్చు. చట్టానికి నిరసన తెలుపుతూ ప్రజాభిప్రాయం ఒక ఉద్యమ రూపంలో తీసుకొచ్చిన ఒత్తిడి ఫలితంగా, హౌస్ ఆఫ్ కామన్స్ ఈ చట్టాన్ని తోసివేసింది; ఇందువల్ల పామర్‌స్టన్ రాజీనామా చేయాల్సి వచ్చింది. పుట 209.

[102] డార్బీ మంత్రివర్గం అధికారానికి వచ్చిన తరువాత, ఇండియా పరిపాలనను మెరుగు పర్చడానికై ఒక సంస్కరణ చట్టాన్ని తయారుచేయమని మంత్రివర్గం బోర్డ్ ఆఫ్ కంట్రోల్ అధ్యక్షుడైన లార్డ్ ఎల్లెన్‌బరోకి అధికారమిచ్చింది. కాని అతను తయారు చేసిన చట్టంతో

ప్రభుత్వం తృప్తిపడలేదు; ఇండియా కౌన్సిల్‌ను ఎన్నుకోవడంలో చట్టంలోని నిబంధనలు చాలా క్లిష్టంగా వుండడమే ఇందుకు కారణం. ఈ చట్టం తీవ్రమైన ప్రతిఘటనను ఎదుర్కోవలసివచ్చి, తోసివేయబడింది. పుట 209.

[103] "Civis Romanus sum" [''నేను రోమన్ పౌరుడును''] — పసిఫికొ అనే వర్తకుని సందర్భంలో జరిగిన విషయాన్ని గురించి పామర్‌స్టన్ 1850 లో జూన్ 25 న హౌస్ ఆఫ్ కామన్స్‌లో ఉపన్యసించిన తరువాత పామర్‌స్టన్‌కి ఎగతాళిగా పెట్టినపేరు. డాన్ పసిఫికొ అనే పేరుగల పోర్చుగీసు వంశస్థుడైన ఒక బ్రిటిష్ పౌరుని రక్షణకై (ఏథన్స్‌లో ఇతని ఇల్లు కాల్చేశారు) గ్రీసుకు పంపిన బ్రిటిష్ యుద్ధ నావల చర్యలను సమర్థించుతూ, పురాతన రోమ్ నిర్వచించినట్టి "civis Romanus sum" అనే రోమన్ పౌరసత్వపు సూత్రం పురాతనకాలపు రోము పౌరులకు సర్వే సర్వత్రా ఎట్టి గౌరవాన్ని సంపాదించి పెట్టిందో, అలాగే బ్రిటిష్ పౌరులు ఎక్కడున్నప్పటికీ బ్రిటిష్ పౌరసత్వం కూడా అట్టి గౌరవాన్నే సంపాదించిపెట్టడం సమంజసమని పామర్‌స్టన్ ఉద్ఘాటించాడు. పామర్‌స్టన్ చేసిన జాతీయ దురహంకారపూరితమైన ఉపన్యాసంపట్ల ఇంగ్లీషు బూర్జువావర్గంవారు తమ ఉత్సాహపూరితమైన హర్షం ప్రకటించారు. పుట 210.

[104] 1852 ఆంగ్ల-బర్మా యుద్ధానికి ఇది వర్తిస్తుంది. (చూ. 19 వ వ్యాఖ్య) పుట 218.

[105] ఈ పుట సంఖ్య, మార్క్స్ తన వివరణల వాచకంలో సందర్భాను సారంగా పేర్కొన్న పుటల సంఖ్యలూ, Robert Sewell, "The Analytical History of India from the Earliest Times to the Abolition of the Honourable East India Company in 1858," London, 1870 (రాబర్ట్ సివెల్ ''ఆదికాలంనుండి, 1858 లో గౌరవనీయ ఈస్ట్ ఇండియా కంపెనీ రద్దు చేయబడిన వరకూ విశ్లేషనాత్మకమైన ఇండియాదేశ చరిత్ర,'' లండన్ 1870.) అనే గ్రంధానికి చెందినవి. పుట 222.

[106] "Guardian" — మొదట స్వేచ్ఛావ్యాపారవాదుల పత్రిక, తరువాత లిబరల్ పార్టీ పత్రిక "Manchester Guardian" సంక్షిప్తనామం. 1821 లో మాంచెస్టర్‌లో స్థాపితమైంది. పుట 235.

107 "The Examiner" – లండన్‌లో 1808–1881 సంవత్సరాలలో వెలువడిన బూర్జువా లిబరల్ వారపత్రిక. పుట 235.

108 "Neue Rheinische Zeitung. Organ der Demokratie" – 1848 జూన్ 1 నుండి 1849 మే 19 వరకూ కలోన్ పట్నంనుండి వెలువడిన దినపత్రిక. మార్క్స్ దీని సంపాదకుడు. ఎంగెల్స్ సంపాదకవర్గంలో సభ్యుడు. ఈ పత్రిక ప్రజాస్వామ్యోద్యమంలో శ్రామికవర్గ పక్షంయొక్క సంఘర్షణాత్మకమైన భాగంగా ఉండి, ప్రజా రాసులకు ప్రబోధం కల్గించుతూ, విప్లవప్రతిఘాతంపట్ల పోరాటానికై వారిని సమీకరించుతూండేది. జర్మనీలోనూ యూరప్‌లోనూ విప్లవాలకు సంబంధించిన కీలక అంశాలపట్ల పత్రికయొక్క దృక్పథాన్ని ప్రతిబింబించినట్టి సంపాదకీయ వ్యాసాలను తప్పనిసరిగా మార్క్స్, ఎంగెల్స్‌లే రాసేవారు. పోలీసుల హింసాకాండకు గురైనప్పటికీ, పత్రిక వాటిని లక్ష్యముచేయకుండానే, విప్లవాత్మక ప్రజాస్వామ్యవాదులయొక్క, శ్రామికవర్గంయొక్క ప్రయోజనాల తరఫున నిలబడుతూ ధైర్యమైన స్థానం తీసుకుంది. మార్క్స్‌ను ప్రవాసం పంపించివేయడం వల్లనూ, "Neue Rheinische Zeitung" ఇతర సంపాదకులపై విధించిన నిర్బంధాఫలితంగానూ పత్రికను మూసివేయాల్సి వచ్చింది. పుట 238.

109 1858 జూన్‌లో బ్రిటన్‌కీ చైనాకీ జరిగిన అసమాన షరతులను కలిగిన టియంట్సిన్ సంధి గురించి రచయిత చెబుతున్నాడు. ఈ సంధితో 1856–1858 లో చైనాతో జరిగిన రెండవ నల్లమందు యుద్ధం అంతమైంది. ఈ సంధి వల్ల మంచూరియాలో యాంగ్‌ట్సీ నదీతీరానున్న కొత్త రేవు పట్టణాలనూ, తైవాన్, హైనాన్ ద్వీపాలనూ, టియంట్సిన్ రేవుపట్టణాన్ని విదేశవర్తకానికి తెరవబడ్డాయి. విదేశప్రభుత్వాలయొక్క ఖాయమైన దౌత్యప్రతినిధులకు పెకింగ్‌లో ప్రవేశం కలిగింది. విదేశీయులకీ, సముద్రతీర నదీతీర నౌకలకూ దేశంలో స్వేచ్ఛగా ప్రయాణంచేసే హక్కు లభించింది. మిషనరీలకు రక్షణహామీలు కల్గించబడ్డాయి. పుట 240.

271

# వ్యక్తినామముల సూచిక

–17వ శతాబ్దిలో ఇంగ్లీషు బూర్జువా వర్గ విప్లవంలో బూర్జువావర్గానికీ, బూర్జువాగా మారిపోయిన కులీనవర్గానికీ నాయకుడు. 1653 నుండి "లార్డ్ ప్రొటెక్టర్ ఆఫ్ ది కామన్‌వెల్త్" (ప్రజాభ్యుదయరాజ్య సంరక్షకుడు). –24.

క్లైవ్, రాబర్ట్ (1725–1774) – బెంగాల్ గవర్నర్ (1757–60, 1765–67), ఇండియాను ఇంగ్లీషువారు జయించిన కాలంలో పాశవికచర్యలను అవలంబించిన వలసపెత్తందార్లలో పేరుమోపిన వాడు. – 28,42.

గార్నియె-పాజేస్, ఎటియేన్ జోసెఫ్ లూయీ (1801–1841) – ఫ్రెంచి రాజకీయవేత్త, బూర్జువా ప్రజాతంత్రవాది, 1830 విప్లవం తరువాత రిపబ్లికన్ ప్రతిపక్షానికి నాయకత్వం వహించాడు. ఫ్రెంచి చేంబర్ ఆఫ్ డిప్యూటీస్ (పార్లమెంటు) సభ్యుడు (1831–34, 1835–41). – 56.

గార్నియె-పాజేస్, లూయీ ఆంటొయిన్ (1803–1878) – ఫ్రెంచి రాజకీయవేత్త, మితవాద రిపబ్లికన్ పక్షం, 1848 లో తాత్కాలిక ప్రభుత్వంలో సభ్యుడు. – 56.

గిబ్బన్, ఎడ్వర్డ్ (1737–1794) – ఇంగ్లీషు బూర్జువా చరిత్రకారుడు, "రోమను సామ్రాజ్య పతనాస్తమయ చరిత్ర" గ్రంథకర్త. – 55.

గ్యోతే, యోహాన్ వొల్ఫ్‌గాంగ్ (1749–1832) – సుప్రసిద్ధ జర్మన్ కవీశ్వరుడు, భావకుడు. – 23.

గ్రన్‌విల్, జార్జి లెవెసన్-గవర్, ఎర్ల్ (1815–1891) – ఇంగ్లీషు రాజ్యధురంధరుడు, విగ్గు, తరువాత లిబరల్ పార్టీ నాయకులలో ఒకడు, విదేశాంగ మంత్రి (1851–52, 1870–74, 1880–85), ప్రీవీ కౌన్సిల్ సభాపతి (1852–54, 1855–58, 1859–66), వలసరాజ్యశాఖా మంత్రి (1868–70, 1886). – 53.

గ్రాంట్, జేమ్స్ హోప్ (1808–1875) – ఇంగ్లీషు జనరల్; చైనాతో జరిగిన మొదటి చైనా యుద్ధంలోనూ (1840–42), ఆంగ్ల-సిక్కు యుద్ధాల్లోనూ (1845–46, 1848–49), ఇండియాలో లేచిన జాతీయ విముక్తి తిరుగుబాటును అణచివేయడంలోనూ (1857–59) పాల్గొన్నాడు. –153, 155, 158, 160, 202, 211, 223–226.

గ్రాంట్, పాట్రిక్ (1804–1895) – ఇంగ్లీషు జనరల్, తరువాత ఫీల్డ్ మార్షల్, మద్రాసు సైన్య సర్వసేనానాయకుడు (1856–61), ఇండియాలో లేచిన జాతీయ విముక్తి తిరుగుబాటును (1857–59) అణచివేయడంలో పాల్గొన్నాడు; 1857 మే నుండి ఆగస్టు వరకు ఇండియాలో సర్వసేనానాయకుడు. – 221.

సాంకేతికం,

# భౌగోళిక నామముల సూచిక

293

పాఠకులకు

ఈ పుస్తకం అనువాదాన్నిగూర్చీ కూర్పునుగూర్చీ మీ అభిప్రాయాలను "ప్రగతి" ప్రచురణాలయానికి తెలుప ప్రార్థితులు:

మీ అభిప్రాయాలను దయచేసి ఈ కింది చిరునా మాకు పంపండి:


Progress Publishers,
21, Zubovsky Boulevard,
Moscow. U.S.S.R.

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | DVKO\|K249 | Date | 18\|4\|22 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, B, 2, 294, 296, 297 | | |
| Missing Pages | NO | | |
| Prepared By | Sandhya | Cutting By | yameema |
| Scanned By | Sandhya | Pages | 303 |